

Chandamama, June '52

Photo by Pranlal K. Patel

భు క్తి

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి





సంపుటి 10 : సంచిక 6

జూన్ 1952


నిత్యజీవితంలో మానవుడు మాట నిలబెట్టుకోవడమనేది గొప్పవిషయం. నిలబెట్టుకోలేకపోవటం ఒక పెద్దలోపం. లోపమే కాదు, తప్పిదమే అవుతుంది. చెప్పినమాట చెల్లించుకున్నవాళ్ళు గౌరవంపొంది కీర్తిగాంచటం, మాట తప్పినవాళ్ళు మర్యాదపోయి లోకంలో నమ్మిక చెడగొట్టుకోవటం చూస్తూనే వుంటాము. ఈనాడే కాదు, పురాణ కాలంనించీ ఈ పరమసత్యం తిరుగు లేనిదిగానే వుంటున్నది. ఆడినమాట నిలబెట్టుకోవడ మనేసరికి, చిన్ననాడు చదువుకొన్న హరిశ్చంద్రుని కథ వెంటనే స్ఫురణకు వస్తుంది. ఇది అందరకూ తెలుసు. ఐతే, మనకు తెలియనిదికూడా చిత్రమైన ఒక చిన్న కథ వున్నది. అదే ఈనెల మీరు చదవబోయే 'ఘనవిజయం.' ఈ కథ చూపులకు చిన్నదేగాని భావాలకు గొప్పది. ఎలా అంటే : ధర్మరాజంతటి వాడి నోట అనృతం వెలువడటమంటే లోకం సహించదు. ధర్మరాజునైనాసరే క్షమించటానికి వీలులేదు. అందుకనే అవతారపురుషుడైన కృష్ణభగవానుడు చిత్రమైన సంఘటన కల్పించాడు. తటస్థంగానేవుంటూ, తమ్ముని వల్లనే ధర్మరాజును మందలింపించాడు. ఆ చిన్న మందలింపుతోనే ధర్మరాజు కళ్ళు తెరవటం, ఆయనకు ఆత్మజ్ఞానం కలగటం జరిగింది. ఈ విధంగా భగవానుని విధి నెరవేరింది.



# వి దూ ష కు డు

రాజావారి కొలువుకూటంలో
ఉండేవాడు విదూషకు డొక్కడు.
తుంటరి, కొంటెవాడు; ఎల్లప్పుడు
చిలిపిపనులు చేసేవాడాతడు.

దరబారులో ఉన్నవారందరు
ఇతనినిచూస్తే హడలేవారే.
ఎక్కడ దుంప తెంచుతాడోనని
ప్రక్క ప్రక్కగా వెడలేవారే.

అతడు వారి విలువగు దుస్తుల్లో
కప్పలు వదిలేవాడు గుట్టుగా
గడ్డం పట్టుకలాగి బావుమని
అరచేవాడిక ఒక్కపెట్టుగా.

హైరానయ్యేవారు కొలువులో
కొమ్ములుదిరిగిన మొనగాళ్ళంతా.
'ఇతని పీచమడచాలి ఎలాగో'
అని అనుకొనేవారు వాళ్ళంతా.

కాని నేర్పుగల ఆ విదూషకుడు
తప్పించుకపోయేవా డెప్పుడు.
దడిచేవాడుకాడు ఎవ్వరికీ
రాజాదరణ చూచుకొని అతడు.

రచన:
"బైరాగి"

ఒక్కతూరి అతడేంచేశాడో
మరి, రాజావారికి మండింది.
అనుకొన్నా రందరూ 'హరి! హరీ!
ఈదెబ్బకు పాపం పండింది.'

చప్పున పట్టి రాజభటు లతనిని
రెక్కలువిరచి కట్టితెచ్చారు.
పూర్వపు కోపమున్నవారందరు
అతని అవస్థచూచి రెచ్చారు.

రాజావారన్నారు—'మూర్ఖుడా!
నేడు నీకు కాలంమూడింది.
చూచా నిన్నాళ్ళూ నీధోరణి,
నీవాడింది ఆటగా ఉంది.

మరణశిక్ష వేస్తున్నా. చెప్పిక
నీకు ఎలాంటి చావు కావాలో?'
అనగా విదూషకుడు వినయంగా
తలవంచుక పలికాడు—'దయాళో!

ముసలితనంవలనే చావాలని
నాకున్నది.' అనగా రాజప్పుడు
తెలివికి మెచ్చి క్షమించా డతనిని.
దక్కా డీతడవా విదూషకుడు.





# నిజస్వరూపం

*

ఒక వూరిలో ఒక సావుకారుండే వాడు. అతడు పిసినిగొట్టు. స్నేహితులు నలుగురూచేరి 'ఏమయ్యా సావుకారూ! ఇంత గడించావేకాని, యేమిటిసార్థకం? ఊరా, పేరా! శాశ్వతంగా వుండేటట్టు ఒక్క చిత్రమయినా వేయించుకో వయ్యా!' అంటూ పురికొలిపారు. ఈ మాట వినగానే సావుకారుకూ సరదా పుట్టింది. చిత్రం తయారుచేసిపెట్టుమని ఎంతోమంది చిత్రకారులను కోరాడు. ఐతే - అతడు పెట్టిన విషమషరతులవల్ల ఒక్కళ్లూ వప్పుకోలేదు.

చివరకు ఒక చిత్రకారుడు 'అయ్యా, మీ నిజస్వరూపం ఉట్టిపడేటట్టుగా నేను చిత్రించి యిస్తాను. మీకు తోచిన బహుమానం ఇద్దురుగాని' అన్నాడు. సావుకారు పొంగిపోయి రంగులు, కుంచెలు, గుడ్డ, వార్నీసు చవకరకానివి కొని యిచ్చాడు. 'సామగ్రి అంతా యిచ్చాను కదా, నీకేమీ కర్చులేనేలేదు. నీ కష్టానికి ఒక్క రూపాయి బహుమతీ యిస్తాను. వేసిపెట్టు' అన్నాడు. అంగీకరించాడు చిత్రకారుడు.

పని పూర్తికాగానే, చిత్రకారుడు తన కర్చుపైన ఒక గొప్ప సభ ఏర్పాటు చేశాడు. 'ఫలానా సావుకారుగారి చిత్రపట ఆవిష్కరణ మహోత్సవానికి అందరూ దయచేయవలసింది' అని కోరాడు. సుముహూర్తానికి వచ్చిన గ్రామపెద్ద వేదికపై నించుని నిండుసభలో పటానికి మూసివున్న తెర తొలగించాడు. చప్పట్లతో, కేకలతో, నవ్వులతో హాలంతా మోతయెత్తిపోయింది.

సావుకారుకు ఆవేశమెత్తింది. చిత్రకారునిపైన తిరగబడ్డాడు. అప్పుడు గ్రామపెద్ద చిత్రకారుణ్ణి పిలిచి అడిగితే, అతడు, 'అయ్యా!—సావుకారు పెట్టిన షరతులకులోబడి ఆయన నిజస్వరూపం చిత్రించి ఇస్తానన్నాను. అలాగే చేశాను. సావుకారు బుర్ర చాలా చిన్నది. హుందా ఐన ఆలోచన లేదు. అందుకనే అర్థణా కాసంత తల. ఆయన దురాశాపాతకుడు. కనుకనే అంత పెద్దనోరు. మంచీ చెడ్డా లేకుండా, రెండు చేతులా పొట్టకింత సంపాయించటమే ఆయనపని. అందుకనే గుమ్మడికాయంత పొట్ట—రెండు చేతులా ఆశతో నానాచెత్తా కూరుకోవటం, అందులో నాశేలూ చూపించాను. ఇది ఆయన నిజస్వరూపం అవునా కాదా, మీరేచెప్పండి' అన్నాడు.

సభఅంతా నిశ్శబ్దంగావుండిపోయింది. సావుకారు తలవంచుకున్నాడు.




పూర్వం ఒక దేశంలో వ్యాఘ్రదంష్ట్రుడనే ఒక రాజు ఉండేవాడు. సైనికులతో వెళ్ళి ఊళ్ళమీదపడి, "మీ వద్దనున్న ధనం ధాన్యం, నగానట్రా తెచ్చి యివ్వండి" అని పీడిస్తోండేవాడు. ఇవ్వకుంటే క్రూరంగా శిక్షించేవాడు: రాజు వస్తున్నాడనేసరికి గ్రామస్థులంతా గజగజ వణికిపోయేవారు.

ఆ దేశంలోనే 'మేధావుల పట్నం' అనే ఒక పట్టణం ఉంది. మేధావులంటే 'తెలివైనవాళ్ళు' అన్నమాట. ఎందుకైనా మంచిదనితోచి వాళ్ళు ఊరిచుట్టూ ఎత్తుగా కోటకుమల్లే ఒక ప్రహరీగోడ కట్టించుకున్నారు. తెలివైనవాళ్ళుగనక వర్తకం గట్రా చేసి, ధనం బాగా సంపాదించారు. వ్యాఘ్రదంష్ట్రుడికి ఆ పట్నం ప్రవేశిస్తే ధనం పుష్కలంగా లభిస్తుందని తెలిసి ఒకనాడు గుఱ్ఱాలమీద సైనికుల్ని వెంటబెట్టుకుని చక్కావచ్చాడు.

గుఱ్ఱపుడెక్కలవల్ల రేగిన దుమ్ము చూడటంతోనే రాజు దోచుకోడానికి వస్తున్నాడని తెలిసి వాళ్లు వెంటనే కోటతలుపు మూయించేశారు. కోటద్వారం మూసి ఉండటం చూసేసరికి రాజుకి ఎక్కడలేని కోపం వచ్చేసింది. "తలుపులు బద్దలగొట్టి లోపల ప్రవేశించండి! మగా, ఆడా, పిల్లా పెద్దా అనే విచక్షణలేకుండా కనపడ్డ ప్రతీ మనిషినీ ముక్కూ, చెవులూ కోసేసి మరీ వదలండి! అప్పుడుగాని నాతడాఖా వీళ్లకి తెలిసిరాదు!" అని అరిచాడు. ఆ అరుపు, లోపల ఉన్నవాళ్లకికూడా వినపడింది. ఐనా వాళ్ళు ధైర్యంచేసి తలుపుగడియ నొక్కిపట్టటం మానలేదు.

ఐతే, సైనికుల ధాటికి ఆ తలుపు ఎంతోసేపు ఆగేటట్టు కనపడలేదు. "ఏంచేస్తే బాగుంటుంది?" అని ఆలోచించటం మొదలెట్టేరు వాళ్ళు. రాజు లోన ప్రవే

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు



శించటంతోనే, ధనధాన్యాలేగాకుండా వస్తు వాహనాలుకూడా పోతాయనటంతో వాళ్లకి హడలు పట్టుకుంది. స్వతహాగా తెలివైన వాళ్ళే ఐనా, ఆ ఆపదసమయంలో వాళ్లకి బుద్ధి పనిచేసిందికాదు. ఆఖరికి, వాళ్ళలో మొనగాడు "ఏమ్రోయ్, మీలో ఎవళ్లో ఒకరు తక్షణం మన గుడ్డితాతవద్దకు పరుగెత్తివెళ్ళి సంగతిచెప్పి, ఏంచేస్తే బాగుంటుందో అడిగిరండి" అన్నాడు.

బుద్ధిశాలి ఐన గుడ్డితాత సంగతంతావిని, "అబ్బీ, 'తెలివి చూపబోయినవాళ్లు భంగపడినట్టుగా వెంగళప్పలు భంగపడరు' అని మన మొనగాడితో చెప్పు" అన్నాడు.

పచ్చినవాడు మొనగాడివద్దకు పోయి ఆ మాట చెప్పేడు. "తెలివి చూపబోయిన వాళ్ళు భంగపడినట్లుగా వెంగళప్పలు భంగపడరట—దీని అర్థమేమిటో తెలిసిందా! చెబుతా : రాజు సైనికులతో కోట ప్రవేశించే సరికి మనమంతా వెఱ్ఱివెంగళప్పలకుమల్లే ప్రవర్తించాలి! అప్పుడు మనకీగండం గడిచిపోతుందన్నమాట! మీరంతా తలో వైపుకీ పోయి తెలివితక్కువ పెద్దమ్మలకి మల్లే నటించండి" అని ఆజ్ఞాపించాడు.

అందరూ తలోవైపుకీ వెళ్ళేరు. కోట తలుపు బద్దలుకొట్టి రాజు సైనికులతో పట్నం ప్రవేశించాడు. వాళ్లకి మొట్ట మొదట మొనగాడే కనిపించాడు. వాడు ఒక బావివద్ద నిలబడి బాల్చీతో ఊరికే నీళ్ళుతోడి దిమ్మరించేస్తున్నాడు. సైనికులతో రాజు, "ముందుగా వీణ్ణి పట్టుకొని ముక్కూ చెవులూ కోసెయ్యండి" అన్నాడు. సేనాధిపతి మొనగాడితో, "ఏయ్, ఇలాగ రా" అన్నాడు. వాడు, "ఉండవయ్యా వస్తాను. నూతిలోంచి చందమామని పైకి తియ్యాలి" అన్నాడు, ఎంతో పనివున్నట్టు నటిస్తూ.

"చందమామను తియ్యడమేమిట్రా?" అని గద్దించాడు సేనాధిపతి.

"నిన్న రాత్రనగా నూతిలో పడింది చందమామ. దాన్ని బాల్చీతో పైకి తియ్యాలని తంటాలుపడుతున్నా" అన్నాడు.

"ఏడిసినట్టుగానే ఉంది. చందమామ ప్రతిబింబం చూసి అది నూతిలో పడిందనుకుంటున్నావు, పిచ్చివాడా!" అంటూ సేనాధిపతి రాజుతో, "ప్రభూ, వీడెవడో ఉత్తి మూర్ఖుడు! వీడి ముక్కు కోసి ఏం లాభం?" అన్నాడు. రాజు, "సరే. వాణ్ణి వదిలెయ్యి. ఇలాగ రా. ఇక్కడెవళ్లో గోడ కడుతున్నారు. వీళ్లపనిపట్టించు" అన్నాడు. సేనాధిపతి వాళ్లని పిలిచేసరికే వాళ్లు, "ఉండవయ్యా, పిట్ట పోకుండా గోడ పూర్తి చెయ్యాలి" అన్నారు. "పిట్టయేమిటోయ్?" అని అడిగాడు సేనాధిపతి.

"ఆ చెట్టుమీద పిట్టవాలింది. కనపట్టం లేదూ? అది పారిపోకుండా అడ్డంగా గోడ కట్టేస్తున్నాం!" అన్నారు వాళ్ళు.

"అఘోరించినట్టే ఉంది మీ తెలివి! ఎగిరిపోవాలంటే పిట్టకి మీగోడ అడ్డొస్తుందా? గోడదాటే ఎగిరిపోతుంది!" అంటూ సేనాధిపతి రాజుతో, "ప్రభూ, వీళ్ళుకూడా ఉత్తి మూర్ఖులే!" అన్నాడు. అందుకు రాజు, "అలైతే వదిలెయ్యి. ఇలాగరా. ఇక్కడెవడో



ఒక ముక్కు మూసుకుని రెండోముక్కుతో ఊపిరి వదలుతున్నాడు, చూడు" అన్నాడు. ఆమాట వినటంతోనే ఆ ఊపిరి వదిలేవాడు సేనాధిపతితో, "అయ్యా, నాకు చత్వారం. సరిగా కనపట్టంలేదు. ఆ కొండపక్క కమ్మరివాడి కొలిమి మండుతోందా లేదా?" అని అడిగాడు. సేనాధిపతి అవైపు చూసి, "నాకు అక్కడ యేమీ కనపట్టంలేదు. ఎక్కడుందేమిటి ఆ కొలిమి?" అన్నాడు. "ఒక మైలుమారం ఉంటుంది. ఆ కొలిమి మండటానికి నా ముక్కుతో గాలి వదులుతున్నాను" అన్నాడు. సేనాధిపతి విరగబడి నవ్వి, "ఆరి నీ తెలివి తేగలుతినా? నీ

ముక్కుగాలి వెళ్ళి మైలుదూరంలో ఎక్కడో ఉన్న కొలిమికి తగులుతుందా ?... ప్రభూ, వీడెవడో వెంగళప్పలలో అగ్రగణ్యుడులా ఉన్నాడు. వీణ్ణికూడా వదిలిపెట్టెయ్యవలసిందే" అంటూ చక్కావచ్చాడు.

వాళ్లు ముందుకు వెడుతూంటే నడ్డిమీద తలుపు మోసుకొస్తూ ఒకడు కనపడ్డాడు. "అబ్బీ, ఆగు. ఈతలుపు ఎక్కడికి మోసుకుపోతున్నావు ?" అన్నాడు రాజు.

"నేను మా అత్తవారింటికి ప్రయాణమై వెడుతున్నాను. మా యింట్లో ధనధాన్యాలను ఎవరూ దోచుకుపోకుండా, ఈ తలుపునుకూడా బద్దలకొట్టి నావెంట తీసుకుపోతున్నాను !" అన్నాడు.

నువ్వెవరో మూఢాగ్రేసరుడిలాగున్నావే? దొంగలభయమైతే కూడా సొమ్ము పట్టుకుపోవాలిగాని సొమ్ము వదిలి తలుపు పెరుక్కుపోతావా ?" అంటూ రాజు ఆశ్చర్యపోసాగాడు. సేనాధిపతి "ప్రభూ, ఈపట్నంలో ఎవణ్ణిచూచినా వెంగళప్పలాగే ఉన్నాడు" అన్నాడు. "మరే" అని రాజు, ముందుకు సాగేసరికి వాళ్లకి ఆ వూరిలో వేళ్లు లెక్కబెడుతో కూచున్న గుడ్డితాత కనపడ్డాడు. "ఏమిట్రా అబ్బీ, లెక్కబెడుతున్నావు?"

"ఈ పట్టణంలో తెలివైనవాళ్ళు ఎందరున్నారో లెక్కబెడుతున్నాను" అన్నాడు.

"ఒక్కడూ లేడు. ఎక్కడ చూసినా శుద్ధ వెంగళప్పలే. ఇక్కడుంటే మాక్కూడా మతిపోయేటట్టుంది. ఏమంటావు సేనాధిపతీ ?" అని ప్రశ్నించాడు రాజు.

"చిత్తం ప్రభూ. ఈ మూర్ఖుల చెవులూ ముక్కులూ కోసి యేంలాభం ?" అన్నాడు.

"ఈ వెఱ్ఱిబాగులవాళ్లదగ్గిర డబ్బు మాత్రం ఉండి ఏడుస్తుందిగనకనా మనం పట్టుకుపోవటానికి ? మన మతులు చెడిపోకుండా త్వరగా పోదాం పదండి అవతలకి" అంటూ రాజు సైనికులతో తిరుగుదారి పట్టేడు. మేధావులు సుఖంగా వున్నారు.






## 6

భవనంలోని వింతలకు అబ్బురపడుతూ, అక్కడి అజ్ఞాత పరిస్థితులకు జిజ్ఞాస చెందుతూ, మంత్రి అలానే కూర్చుండిపోయాడు. గాఢమైన ఆలోచనలో అతనికి వేళాపాళా తెలియనేలేదు. ఇంకా కొద్దిసేపటిలో ప్రొద్దుగ్రుంకుతుందనగా అల్లంత దూరంనించి వీనులవిందుగా ఒక మధుర ధ్వని వినిపించింది. ఐతే, ఈ ధ్వని ఇంతకుముందు మంత్రికి పరిచయమైందే. లోగడ మాయడొప్ప చేసివున్న ధ్వని ఇదేనని అతడు వెంటనే గ్రహించాడు.

క్రమంగా ఆ ధ్వని అతనికి దగ్గరయింది. మరి కొద్దిసేపటిలోనే మాయడొప్ప ఈ భవనంపైకి వచ్చేసి, ఆగింది. అది ఆగటమేమిటి, దానిమోత నిలిచిపోవడమేమిటి? రెండూ ఒక్కమాటే జరిగినై.

'డొప్పలాగా కనబడే ఇది ఒక విమానం. ఈ విమానంమీద ఎవరోగాని ఈ భవనానికి వస్తూపోతూ వుంటారు' అని, తను చూచిన దాన్నిబట్టి మంత్రి ఊహించాడు. అతడు ఇలా ఆలోచించేటంతలోనే అలికిడి అయింది. అది మనుష్యులుచేసే అలికిడే!

మరుక్షణంలోనే ఎదట ప్రత్యక్షమై "ఎవరవునీవు? ఎలావచ్చావు? ఎందుకు వచ్చావు?" అని గబగబ ప్రశ్నలు కురిపిస్తూ ఒక చిన్నారి బాలుడు అతనికి కనిపించాడు.

బాలుడు కంటపడటంతోనే ఆశ్చర్యమూ, ఆవేశమూ మంత్రిలో ఒక్కసారిగా పెల్లుబికనై. "ఏమిటీ! దేవసింహుడే!!— ఎన్నాళ్లకు చూచానోయి నా తండ్రీ!!!" అంటూ, ఆత్రంతో బాలుణ్ణి చేరదీసుకో బోయాడు మంత్రి.



17



కాని, ఆ బాలుడు మంత్రికి దొరకనే లేదు. "దుర్మార్గుడా!—సౌధంలో చొర బడటమే గాకుండా నన్నెత్తుకుపోవటానికి చూస్తున్నావా? మా అమ్మతో చెబుతానుండు నీపని..." అని అంటూ చేతనున్న మాయదండం తను వేసుకొన్న చెప్పులకు తాకించాడు. తాకించటమే తడవుగా మహిమగల ఆ చెప్పులు కుర్రవానిని భవనంలో ఎక్కడికో తీసుకపోయినై. ఇదంతా చూడగా, ఆ బాలుడు సొట్టవాడనికూడా రూఢి అయింది. నివ్వెరపోయాడు మంత్రి.

"ఇదేమిటి వింత!— చనిపోయాడనుకున్న నా దేవసింహుడు ఇక్కడనేవున్నాడే! సొట్టబాలుణ్ని కళ్ళారా చూచానే! నమ్మకపోవటమెలా? పైగా, 'మా అమ్మతో చెబుతానుండు నీ పని...' అంటూ పారిపోయాడే? ఆహా!—మా దేవప్రియకూడా బ్రతికేఉన్నదా? మా తల్లి దేవప్రియ జీవించివుండటంకంటే నాకు కావాలిసిం దేమిటి? ఇవాళ ఎంత అదృష్టం! ఎంత అదృష్టం... ఎటువంటి సుదినం!!!— అయితే, తల్లీ కొడుకులిద్దరూ భూలోకంలో అవతారం చాలించి ఇలా స్వర్గంలోకి వచ్చేశారన్నమాట! ఇంతకూ, నేనిప్పుడు ఏలోకంలో వున్నాను? ఇది స్వర్గలోకమేనా? లేకుంటే, ఈ అపూర్వ సౌధమేమిటి? కనివిని ఎరుగని ఈ వింతలేమిటి? అన్నిటికంటే చిత్రం, మృతజీవులను కళ్ళారా నేను చూడగల్గడమేమిటి?— వచ్చి వచ్చి నేను సరాసరి స్వర్గమే చేరుకున్నానా? అవును. సందేహంలేదు. పసివాడు, దేవసింహుడు పాపం—చూడగానే నన్ను గుర్తించలేకపోయాడు. ఎవరినో అనుకుని కంగారుపడ్డాడు. పోనీ, నెమ్మదిపడనీ. కాస్తంత మచ్చికయితే వాడే పోల్చుకుంటాడు. ఇక్కడ వాడు క్షేమంగా ఉన్నాడని తెలుసుకొన్నా. చాలు. అదే పదివేలు.

మరికొంచెంసేపు నిరీక్షించినట్టయితే, మా తల్లి దేవప్రియ ఇవతలకు వస్తుంది. ఆమెనుకూడా చూడవచ్చు. నిజంగా ఇవాళ ఎంత సుదినం! ఎంత సుదినం!!" అని ఈవిధంగా తనలో తనే తర్కించుకొంటూ అపరిమితమైన ఆనందంపొందుతూ, రాణి దర్శనంకోసం ఎదురుతెన్నులు చూస్తూ, అక్కడనే పచార్లుచేస్తూ వున్నాడు.




* * *

ఇక అక్కడ శక్తిసింహుడి పరిస్థితి ఏలా వున్నదంటే: పారిపోయిన దుష్టమంత్రిని పట్టితెస్తాము' అని పంతంపట్టి వెళ్లినవాళ్లలో ఒక్కడూ తిరిగిరాలేదు. మరి, అటువంటప్పుడు శక్తిసింహుడిమనసు ఎలా వుంటుంది?

ఉన్నవాడున్నట్టుగానే ఆస్థానవైద్యుడి వద్దకు వెళ్లి, 'గురూజీ!—మన మంత్రి సామాన్యుడుకాడు. తెలుసుకదా! అసహాయశూరుడు. అజేయుడు. అటువంటివాడిని పట్టితెస్తామని ఉద్రేకపడి బీరాలు పలికారేగాని, మనవాళ్లవల్ల నేమవుతుంద? అతన్ని వెతికిపట్టడం వాళ్లకు సాధ్యంకాదని నాకు అప్పుడే తెలుసు. ఇక యిప్పుడు—ఏమైనా సరే, మీరు పూనుకొంటేనే ఈ విషయంలో మాటతక్కుతుంది. లేకుంటే లేదుమరి. ఇది శ్రమదమాదులతో కూడుకొన్నపని అని తెలిసికూడా తప్పనిసరిగా ఈపని మీకు వప్పగించవలసి వచ్చింది. ఏమంటారు?' అని అడిగాడు.

ఈపని వైద్యుడికి చాలా ఉత్సాహాన్ని కలిగించింది. ఏమీ అంటే: గుదిబండగా వుంటున్న రాజ్యపాలన తప్పిపోవటం; కుతంత్రాలు పన్నుతూవుండే శక్తిసింహుని ఎదటనుండి విరగడైపోవటం; మించి, తనకు అభిమానధనుడైన మంత్రిని చూడబోవటం — ఇన్నికార్యాలు ఒక్కసారిగా కలిసివస్తున్నవాయె.



ఈ కారణాలన్నీ వైద్యుని మనస్సులో మెరపు మెరసినట్టుగా స్ఫురించినై. అందు చేత, శక్తిసింహుడు అడగటమే తడవుగా "రాజా!—నీమాటకు ఎన్నడైనా తిరు గున్నదా? ఇదుగో, ఇప్పుడే బయల్దేరు తున్నా" అనిచెప్పి, తక్షణమే ప్రయాణానికి తగిన ఏర్పాట్లు చేసుకున్నాడు.

పరివారంతో సహా వైద్యుడు పదిరోజుల పాటు నడవగా, కొండప్రదేశం తగిలింది. చేరువనే ఒక పెద్ద మైదానం కనిపించింది. కొంచెం విశ్రమించి మళ్ళీ నడక సాగిం చారు వాళ్ళు. ఒక్క నూరుగజాలు వెళ్ళే సరికల్లా ఒకచిత్రం జరిగింది.

భటులు ముందుకు నెట్టుకుపోతున్నారు. వారికి ఏదో అడ్డువచ్చినట్టనిపించింది. తేరి చూచారు. ఎదట యేమీలేదు. పోదామని మళ్ళీ యత్నించారు. కాని, మునుపటి లాగానే ఏదో అడ్డుకోవటంవల్ల పోలేక పోయారు. అందరూ కలిసి వైద్యునిదగ్గరకు వెళ్ళి "అయ్యా, మేము పోదామంటే తోవ ఈయకుండా ఏదో మమ్మల్ని ఆటంకపరు స్తున్నది. అది చేతికి తగులుతున్నది కాని, కంటికి కనిపించటంలేదు. ఈ విడ్డూరం యేమిటో కనిపెట్టాలి మీరు" అంటూ విన్నవించుకున్నారు.

ఆస్థానవైద్యుడు పట్టలేని సంతోషంతో పైకీకిందికీ చూస్తూ, పచార్లు చేయసాగాడు. 'ఇదేమిటి? దారీ తెన్నూ తెలియక మనంద రమూ ఇలా బాధపడుతూవుంటే ఈ పెద్దమనిషి ఏమీ పట్టించుకోకుండా వుంటున్నాడే? చీమ కుట్టినట్టయినా లేదే ఆయనకు?' అని భటులు తమలో తాము గుసగుసలాడుకో సాగారు. 'ఇటువంటి సమ యంలో ఆయనకీ నిశ్చింత ఏమిటి? ఆ పరమానంద మేమిటి?'—అని వారిలో కొందరు తెలివిమంతులు ప్రశ్నించుకో సాగారుకూడా.




అంతలోనే ఆకాశమార్గాన విమానం మోత వినిపించింది. అది, వాళ్ల తలమీది నించి జోరుగా ఎక్కడికో పోతున్నది. అప్పుడు వైద్యుడు వారిని వేగిరపెట్టి, "ఆలోచనా పాలోచనా లేకుండా చూస్తూ కూర్చున్నారేమిటయ్యా! పదండి. ఆ విమానం ఏమిటో, అందులో ఉన్నవారెవరో కూడా పోయి కనిపెట్టిరండి. ఈలోపల నేనిక్కడనేవుండి, ఈ ఆటంకానికి కారణ మేమిటో కనుక్కుంటాను" అని హెచ్చరించాడు.

అందుకు వాళ్ళు 'అయ్యో, ఏమో ననుకొన్నాము. వైద్యుడు ఉదాసీనంగాలేడు. ఈ దృష్టిమీదనే వున్నాడు. ఏమీ పట్టించుకోవటం లేదనిచెప్పి ఆయనను గురించి తొందరపాటుగా అభిప్రాయపడ్డాము. పొరపాటు' అనుకొని పశ్చాత్తాపం చెందారు. వైద్యుని ఆజ్ఞను శిరసావహించి, పైన విమానపు జాడ చూచుకొంటూ, భూమి మీద దారిచేసికొంటూ పడివడిగా వాళ్లు పోసాగారు.

ఇలా వాళ్ళు అక్కడినుండి వెళ్ళిపోవటమే వైద్యుడికి కావలిసింది. ఇంత మంది పరివారాన్ని అడుగు వేయనీయక అడ్డగించింది ఒక అపూర్వసౌధం. ఆ సౌధం ఒక్క వైద్యుడికిమాత్రమే స్పష్టంగా ఎదట కనిపిస్తున్నది. తక్కిన మరెవళ్ళకూ కనిపించలేదు. వాళ్లందరకూ భవనం చేతికి తగులుతున్నదే కాని, కంటికి కనిపించలేదు.

భవనం చూడగానే వైద్యుని సంతోషానికి మేరలేకపోయింది. పరివారానికి ఇది ఎంత మాత్రమూ కనిపించకపోవటంచేతనే వాళ్ళు తాపత్రయపడుతున్న సంగతి మొదటనే గ్రహించాడాయన. అందుకనే నవ్వు పట్టలేకపోయాడు. ఇదేదో మహిమ గల రహస్యభవనమని వెంటనే ఆయనకు అవగతమయింది. లేకుంటే—ఆ దివ్య



భవనం తనకు మాత్రం కళ్లయెదట స్పష్టంగా కనిపించడమేమిటి? తన పరివారం దారీ తెన్నూ తెలియక, ఎవరో ఆటంకపరుస్తున్నారని గోలపెట్టడ మేమిటి?

ఈ దేవరహస్యం పిట్టకైనా వెల్లడించకూడదు అని నిశ్చయించుకొన్నాడు. అందుచేతనే, పరివారమంతా విరగడైపోతే తన పరిశోధనలు స్వేచ్ఛగా సాగించుకోవచ్చునని ఆయనకు తొందరపాటు కలిగింది. అదృష్టవశాన, ఆ విమానపుమోత వినిపించటమూ, ఆ మిషమీద వాళ్ళను అవతలకు సాగనంపటమూ జరిగింది. ఇంతవరకు బాగానే వున్నదనుకొన్నాడు.

విచిత్రమైన ఈ భవనంయొక్క కీలకం కనిపెట్టాలనే ఆత్రంతో వైద్యుడు పచార్లు చేస్తూ అడుగులు వేయగా వేయగా, అతని కాలికి ఒక చిన్న మీట తగిలింది. తగలగానే నలుచదరంగా భూమిమీద ఒక బీట ఏర్పడింది. వైద్యుడు నించున్నపాటునే దిగువకంటా వెళ్ళిపోయాడు. 'పాతాళ లోకంలోకేమైనా దిగిపోతున్నానా?' అని ఆయనకు దిగ్భ్రమ కలిగింది.

తనను అలా కిందికి తీసుకపోతున్న యంత్రమేదో వైద్యుడికి కనిపించలేదు. కాని, కొంత దూరం వెళ్లి అది ఆగింది. ఆగినవెంటనే ఒక ద్వారం కనిపించింది. ద్వారంలోపలికి వెళ్లిచూడగా అది ఒక బోనువంటి పెట్టె!

వైద్యుడు పెట్టెలో ప్రవేశించాడో లేదో, రయ్యిమంటూ ఆయన్ని పైకంటా తీసుకపోయింది. తీసుకపోయి ఒకచోట ఆగేసరికి మంత్రి ఎదురువచ్చాడు. ఒకరినొకరు చూచుకొని, ఇద్దరూ విస్తుపోయారు. తన తపం ఫలించినందుకు వైద్యుడు అపారమైన ఆనందంలో మునిగిపోయాడు. ఆయనకు మంత్రి కంటపడగానే కొండంత ధైర్యం వచ్చింది. ఇంతవరకూ తనుచూచిన




చిత్రాలన్నీ మంత్రి వైద్యుడికి కూడా చూపించగా ఆయన తన్మయుడయ్యాడు. విశేషాలన్నీ విప్పిచెప్పగా వైద్యుడు పరవశత్వమే పొందాడు. ఈ విధంగా మంత్రీ, వైద్యుడూ తలవనితలంపుగా కలుసుకున్నాక పరిస్థితులు ఎంత చిత్రంగా పరిణమిస్తాయో చెప్పేదేమిటి?

* * *

తను అంతగా నమ్మికొలిచిన ఆస్థాన వైద్యుడుకాని, వెంటవెళ్ళిన పరివారంలో ఒక్కళ్లయినా కాని మరలిరాలేదు. మనుషుల్ని పంపినప్పటికీ వాళ్లజాడ అయినా తెలియలేదు. ఏమనుకోవాలి? ఇంతమందీ కలిసి ఎక్కడికి పోయినట్టు? ఈవాలకం చూచి అట్టుడికిపోయినట్టు ఉడికిపోసాగాడు శక్తిసింహుడు.

'నా జాతకప్రభావ మేమిటోగాని, ఏమి చేదామన్నా ఎదురెత్తుగానే వస్తున్నది! చేతిలోపనికదా అనుకున్నదే చేయలేక పోతున్నాను. నా మనిషేకదా అనుకున్న వాళ్లందరూ తడిగుడ్డతో గొంతుకోస్తున్నారు. వైద్యుడు ఇలా నన్ను మోసగిస్తాడని కలలోనైనా తలపగలనా? అయనను గద్దె యెక్కించి, తెరవెనుక నాటకమాడదా మనుకుంటే, నా ఆశలన్నీ ఈవిధంగా పరిణమించినయ్యే!

'పోనీ అని కుటుంబానికా ఏవిధంగానూ నిర్వాహకం చేయలేకపోయాను. పెద్దవాడికి పట్టంకడదామనుకుని ఎంతగానో తాపత్రయపడితే, వాడు నన్ను నడిసంద్రాన ముంచిపోయాడు! నా సంసారాన్నే నేను ఉద్ధరించుకోలేకపోయినప్పుడు నాకీ రాజ్యమెందుకు? ఏలడ మెందుకు? ఏది ఎలా పోతే నాకేమి?

'అదినుంచీ ఇది అనాధ రాజ్యమే! మధ్యనివచ్చి ఏమో చేదామనుకొంటే మటుకి కుదురుతుందా? ఉహుఁ. అపేరు

అలా శాశ్వత బ్రహ్మకల్పంగా నిలిచిపోవలిసిందే. ఈ చెడ్డపేరులేకుండా చేదామని తలిచేటంతలోనే కష్టాలు నన్ను ముసురుకుని, నా కుటుంబాన్ని గంగలో ముంచినై. ఏది యెలాపోతేపోనీ. ఇకనేను తాపత్రయపడను ' అంటూ వైరాగ్యభావం కనబరిచాడు శక్తిసింహుడు.

రాజ్యకాంక్ష సడలిందికాని, శక్తిసింహునికి మంత్రిమీది కార్పణ్యంమాత్రం కొంచెమైనా తగ్గలేదు. బొందెలో ప్రాణంవుండగా, తనకు బద్ధశత్రువైన మంత్రి శిక్షపొందటం కనులారాచూస్తేకాని నిదురపోకూడదనుకొన్నాడు. ఇదే తనకు జీవితంలో మిగిలివున్న కోరిక. ఇందుకోసమని ఎలా అయినా మంత్రిని పట్టాలి.

మంత్రిని పట్టటానికి ఎవరినిపంపితే వారే తిరిగిరాకుండా వున్నారు. కనుక ఈ మాయఏమిటో తనే స్వయంగా తెలుసుకోవటానికి అతడు నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో రాజ్యాన్ని ప్రజలఇష్టానికే వదిలేసి, తను పాదచారిఐ, మంత్రిని వెదుకటానికని బయల్దేరాడు.

శక్తిసింహుడు ఎన్నో శ్రమలకు లోనై, కొన్నాళ్ళకల్లా ఒక మహారణ్యం చేరుకొన్నాడు. చేరుకొని, ఒక చెట్టునీడని విశ్రమించాడు. ఆ మహారణ్యం ప్రక్కనే ఒక మైదానమున్నది. బడలికచేత అతనికి చిన్న కునుకు పట్టేటంతలో ఒక విమానంవంటిది శబ్దంచేసుకొంటూవచ్చి ఆ మైదానంలో విడిసింది. అందులోనించి అందాల బాలుడొకడు దిగి, చేతులతోనూ కాళ్లతోనూ డేకుకొంటూ అరణ్యంలోని చెట్లవైపు రాబోయాడు.

ఈ సందడికి శక్తిసింహునికి మెలకువ వచ్చింది. తనవైపేవస్తున్న ఆ అందాల బాలుణ్ణి చూచీ చూడటంతోనే అతడు కెవ్వున కేకవేసి, వానిని పట్టుకుందామని లేచాడు. —(ఇంకా వుంది)






ఒకానొక అరణ్యానికి సమీపాన కుటీరంలో ఒక పదేళ్ళబాలుడు నివసిస్తూ ఉండేవాడు. అరణ్యప్రాంతంలోనే వున్నప్పటికీ వాడికి సరస్వతి కటాక్షం కలగటంచేత, వరప్రసాదంగా సమస్తవిద్యలూ అలవడినై. అన్ని విద్యలతోపాటు మంత్రవిద్యలోకూడా నేర్పు కలిగింది. అడవిలోవుండే పక్షుల భాషలూ జంతువుల భాషలూ అన్నీ వాడికి తెలుసు. తన విద్యలన్నీ వాడు పరోపకారంకోసమే వినియోగించేవాడు. అందుచేత ఆ బాలుణ్ణి అందరూ 'బాలయోగి' అని పిలుస్తూ వచ్చారు.

ఒకరోజు మధ్యాహ్నం ఎండ మటమట కాస్తున్నది. చెట్టునీడని కూర్చునివున్న బాలయోగికి చిన్న కునుకుపట్టింది. కునుకు గాఢనిద్రగా మారింది. మంచినిద్రలోవున్న బాలయోగికి ఏదో వికృతమైన శబ్దం వినిపించి, మెలకువ వచ్చింది. ఏమిటా అని లేచిచూడగా, అది ఒక స్త్రీకంఠం! "రక్షించు, రక్షించు!!" అంటూ విలపించే ఆర్తనాదం.

విస్తుపోతూ ఆ శబ్దంవచ్చిన దిక్కుకి వెళ్ళాడు బాలయోగి. అక్కడ చెట్టుచాటున నక్కివున్న ఒక సుందరాంగి భయంతో కంపించిపోతూ, అతడివంక దీనంగా చూచింది.

"నన్నామె తరుముకు వస్తున్నది. దాక్కొనేందుకు తావు చూపించు, రక్షించు మహానుభావా?" అంటూ కడుపు కరిగిపోయేటట్టు ప్రార్థించింది.

"ఎవరా తరుముకువచ్చేది? ఎందుకు అలా వస్తున్నది?" అంటూ ప్రశ్నలు వేయసాగాడు బాలయోగి.

"ఇప్పుడేమీ అడగకండి. శూకరదేశ ప్రభువు కుమారుడు భీకరసేనుడు ఒక యక్షకన్యను పెళ్ళాడదామనుకున్నాడు.

కుమారి వి. హేమలత - సికింద్రాబాద్




తరువాత ఆయన మనసు నాపైన చిక్కుకున్నది. అందుకని ఆమెకు నాపైన ద్వేషంపుట్టింది. ఆమె నన్నేమిచేసినా చేయగలదు" అని చెప్పిందామె.

"మరైతే, భీకరసేనుణ్ణి పెళ్ళాడాలనివున్నదా నీకు? అని మళ్ళీ అడిగాడు బాలయోగి.

"వాడు కురూపి. వాడిని చేసుకోవటానికి ఏ ఆడదీ ఇష్టపడదు. యక్షకన్యకూ ఇష్టంలేదు. కాని, వాడు ధనవంతుడు. ధనం కోసమే ఆమె అతనిపైన ప్రేమ వున్నట్టు నటిస్తున్నది" అని చెబుతూ, "స్వామీ!—ఇంక జాగుచేయకండి. కంటబడితే నన్ను ప్రాణాలతో వదలదు ఆమె. రక్షించండి. రహస్యస్థలమేదైనా చూపించండి," అంటూ ప్రాధేయపడింది.

జాలిపడ్డాడు బాలయోగి. వెంటనే ఆమెను తన కుటీరానికి వెంటబెట్టుకు వెళ్లాడు. లోపలినుండి కమండలువుతో మంత్రజలం పట్టుకువచ్చి ఆమెమీద చిలకరించాడు. మరుక్షణంలోనే ఆ సుందరకన్య అందాలుచిందేటి ఒక తుమ్మెదగా మారి పోయింది. ఝూంకారం పెట్టుకొంటూపోయి పువ్వులమీద వాలి, వాటిలోని మకరందాన్ని చవిచూడసాగింది.

'సరే, ఈ తుమ్మెద ఈ సమీపంలో తోటలలోనే సంచరిస్తూ వుంటుందికదా' అని అనుకొన్నాడు బాలయోగి.

అంతలోనే గాజులు గలగలమనిపిస్తూ యక్షకన్య అతడియెదట ప్రత్యక్షమైంది. "ఈదారిని ఎవరైనా మానవకన్య రావటం చూచావా?" అని అడిగింది, గద్దించే ధోరణిలో.

బాలయోగి బిత్తరపోతూ 'లే'దన్నాడు. 'తప్పించుకో చూచావంటే కుదరదు. నిజంచెప్పు. ఆమెను ఎక్కడ దాచావో చెప్పు' అంటూ ఆ యక్షకన్య అతనిని

నిలదీసి అడిగింది. 'నాకు తెలియదు గాక, తెలియదు' అని అనేశాడు బాలయోగి. అంతలో తుమ్మెదవచ్చి ఊరుకోక, యక్ష కన్య ముక్కుమీద పుటుక్కున కుట్టింది. యక్షకన్య దానివేపు తీవ్రంగా చూచి, 'ఓసీ నీవేనా! చూసుకో, నిన్నేంచేస్తానో ?' అంటూ హుంకరించింది. యక్షకన్యను కుట్టిన ఆ తుమ్మెద అల్లిబిల్లిగా తిరుగుతూ పోయి, మెల్లగా బాలయోగి కుటీరం ప్రవేశించింది.

కుటీరంలో, ఒక చిన్నగదిలో బల్ల అమర్చివుంది. బల్లమీద వ్రాతపరికరాలున్నాయి. తుమ్మెద సరాసరి అక్కడికి వెళ్ళి, సిరాబుడ్డిలో కాళ్ళుముంచింది. బల్ల మీదవున్న తెల్లకాగితంపైన వంకరటింకరగా గీతలుపెట్టింది. ఆ గీతలు పరిశీలనగా చూస్తే, బాలయోగి భాషలో 'కృతజ్ఞులాలను' అని అర్థమిచ్చేటట్టున్నది. ఇలా గీతలు గీయటం పూర్తికాగానే ఏదో ఒక గొప్ప విధి నెరవేర్చుకొన్నట్టుగా తృప్తితో, సంతోషంతో చెట్టుచెట్టుకూ పువ్వుపువ్వుకూ తిరుగుతూ సాగిపోయింది.

అక్కడ—కసిపూనిన యక్షకన్య ఊరికే ఉండలేదు. తనకు నేస్తాలైన కందిరీగలను



పిలిచింది. "అందాలుచిందేటి ఒక తుమ్మెద ఈ ప్రాంతాలలో సంచరిస్తూ వుంటుంది. దానిని ఎలాఐనా పట్టి, గూట్లో చిక్కించుకుని, అది దొరికినవెంటనే నాకు కబురు పంపించవలసిందని నా అజ్ఞగా సాలిపురుగులన్నింటికీ చెప్పిరండి" అన్నది. తక్షణమే ఈకబురు అడవిలోని సాలీడులన్నింటికీ అందించినై కందిరీగలు.

మరికొద్దిసేపటికే మన తుమ్మెద తిరుగుతూ తిరుగుతూ ఒక పరమసుందరమైన పువ్వులగుత్తిమీద వాలింది. అక్కడ ఒక సాలీడు, పట్టుదారాలతో వుచ్చుపన్ని కూర్చున్నది. తుమ్మెద కంటపడగానే అది

అనేకవిధాలుగా దానిని పొగుడుతూ, తీయటి మాటలు చెప్పి 'మాయిల్లు చూడువు గాని, లోపలికి రా' అని పిలిచింది.

అమాయిక ఐన తుమ్మెద సాలీడు మాటకు ఉబ్బిపోయి, లోపలికివెళ్ళి గూట్లో యిరుక్కుంది. దాని రెక్కలకూ కాళ్లకూ ఉచ్చులు బిగిసిపోయినై. అందుచేత అది కాస్తకూడా కదలలేకపోయింది.

యక్షకన్య పోగానే తుమ్మెదను వెదకటంకోసం బయల్దేరాడు బాలయోగి. ఎంతకూ తుమ్మెద కనబడలేదు. పువ్వు పువ్వూ వెతికాడు. ప్రతి సాలెగూడూ పరిశీలించాడు. చివరకు అది యిరుక్కుపోయిన ఈ సాలెగూటికి వచ్చిచూచాడు. తుమ్మెద కంటబడినందుకు అనందమైంది. కాని, అది యిలా ఇరుక్కుపోవటం చూచి చెప్పలేనంత కోపం వచ్చింది.

వెంటనే సాలెగూటిని వేళ్ళతో చుట్టబెట్టి స్వరూపనాశనంచేశాడు. తుమ్మెదను తాకి మంత్రం జపించాడు. తక్షణమే అది మామూలు అనాటి కన్యరూపం పొంది చిరునవ్వు నవ్వుతూ ఎక్కడికో ఎగిరిపోయింది.

బాలయోగి ఆశ్చర్యంతో చూచాడు. బాగా యోచించగా, తన మంత్రంలో పొరపాటువల్ల ఆ తుమ్మెద మానవకన్యగా మారిపోయినప్పటికీ, రెక్కలు మాత్రం అలానే నిలిచిపోయినట్టు గ్రహించాడు. ఆ కన్య ఎగిరిపోతూ నవ్విన చిరునవ్వు మట్టుకు అతని హృదయంమీద అచ్చుపడిపోయింది. ఎందుచేత ఆమె మారు మాటలేకుండా, ఇంత ఉపకారంచేసిన తనకు కృతజ్ఞత ఐనా తెలపకుండా వెళ్ళిపోయిందా అని అలోచించుకొంటూ అతడు తన కుటీరం చేరుకున్నాడు. గదిలోకి వెళ్లి, కాగితంపైన గీతలు చూచుకోగానే, అతని కన్నులవెంట అప్రయత్నంగా జలజలమంటూ బాష్పాలు రాలినై.






రాజన్న బీద బాలుడు. పదివత్సరాల వయసువాడయేసరికే 'నా' అన్నవారెవరూ లేనివాడయ్యాడు. చదువూ సంధ్యలూ చెప్పించే చుట్టపక్కాలయినా లేని అతడికి ఓ కాపుదగ్గర గొడ్లకాపరిగా చేరి బ్రతకడంతప్ప మరోమార్గం లేకపోయింది.

కాపూ, కాపుభార్యా, రోజు అస్తమానం తమలోతాము పోట్లాడుకోవడం, ఇరుగు పొరుగువాళ్లతో పోట్లాడడంతోనే సరిపోయేది. పిల్లాజెల్లాలేని వాళ్లిద్దరకూ, ఇతరుల పిల్లలంటే ముద్దూ మురిపాలంటూ లేకపోగా, అవకాశం దొరికినప్పుడల్లా, అవసరమైనా కాకపోయినా, కుర్రవాళ్లను కసరటం, కొట్టటం బాగా అలవాటు. వాళ్ల యీ దురలవాటుకు అందుబాటులోవున్న గొడ్లకాపరి రాజన్న, సులువుగా గురి అయ్యేవాడు.

అది రోహిణీకార్తె కావటంచేత ఎండ పొగలూ సెగలూ కక్కుతున్నది. ఎడాపెడా విసిరే వెచ్చనిగాలి చెట్టూచేమల్నే కాక, పశుపక్ష్యాదుల్నీ, మనుష్యుల్నీకూడా నిలువునా కాల్చి దహించేస్తున్నది. అయినా రాజన్న గొడ్లను మేపేటందుకు తుమ్మలబీటికి తోలుకెళ్లడం తప్పలేదు. ఎత్తయిన ఏటికట్ట దిగువను, గుబురుగా పెరిగిన తుమ్మచెట్ల మధ్యకు గేదెల్ని తోలి, రాజన్న ఒక చెట్టుకింద వెల్లకిలా పడుకుని తన కష్టాల్నిగురించి తలపోయసాగాడు.

ప్రొద్దుటనగా తాగిన చాలీచాలని తైదజావతప్ప అతడింతవరకూ మరేమీ ముట్టలేదు. మట్టమధ్యాహ్నమైనకొద్దీ రాజన్నకు అకలి పీడించివేస్తున్నది.

నిట్టూర్చాడు రాజన్న. తన కష్టాలకు అంతమే లేదా అని వాపోయాడు. ఎంత శ్రమపడినా, ఎన్నివిధాల తిట్లూ తన్నులూ సహించినా కడుపైనా నిండని అకలిబ్రతుకు ఎందుకా అన్న వైరాగ్యంకూడా కలిగింది.

డి. సుధీర్‌బాబు - జయపురం



లేచికూర్చున్నాడు రాజన్న. గొడ్లన్నీ మేయడంమాని తాపంతో రొప్పతూ, తుమ్మ చెట్ల నీడను పడుకుని వున్నయి. ఆకలితో నకనకలాడే రాజన్నకు కళ్ళు బైర్లుకమ్ము తున్నట్లయింది. కూర్చున్నచోటునే ఒక్క నిమిషకాలం అతడు కళ్లు మూసుకున్నాడు. తరువాత బరువుగా కనురెప్పల్ని పైకెత్తాడు. ఆ సమయంలో ఎదురుగా కనబడిన ఒక చక్కని చెప్పులజత అతణ్ణి ఆశ్చర్యంలో గిరికీలు తియించింది.

తడబడుతున్న చేతులతో, ఆ చెప్పుల జతను పట్టుకుని వణుకుతూన్న కాళ్లకు తొడుక్కున్నాడు. మరుక్షణాన తన శరీ రంలో కలిగిన మార్పుకి అతడు తబ్బిబ్బు అయాడు. కడుపులో చిచ్చులాగా కాల్చే ఆకలి మటుమాయమైంది. గుండె దడా, వణికే కాళ్ళుచేతులూ, బైర్లుకమ్ముతూన్న నేత్రాలూ—అన్నీ స్వస్థతచెందినై. మితిలేని ఆనందం నిలువునా ప్రవహించినట్టయింది.

"హేయ్! హేయ్! ఎంత హుషారుగా వుంది!" అంటూ రాజన్న అటూ యిటూ గంతులేయసాగాడు. ఆకల్ని జయించాననే ధీమా, బాధలన్నీ తొలిగిపోయినవనే విశ్వాసంకూడా అతడికెంతో హాయినిచ్చింది.

పాపం! రాజన్న దురదృష్టవంతుడు. మైమరచిన సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బు లౌతున్నాడు. ఐతే, హఠాత్తుగా జాలికొలిపే రోదనస్వరం వినపడింది. తమాయించు కుని ఆ వైపు చూచాడు.

ఆరేళ్ల కుర్రాడు ఒకడు కళ్ళల్లో నీళ్లు తిరుగుతూ తను తొడుక్కున్న చెప్పులవేపే చూస్తుండడం రాజన్న కంటపడింది.

"ఎందుకు ఏడుస్తున్నావ్ అబ్బాయీ?" అన్నాడు రాజన్న, కుర్రవాడి బుజం తట్టుతూ. "ఆ చెప్పులు నావి. ప్రొద్దున్న ఇక్కడ పారేసుకున్నాను" అన్నాడు కుర్రాడు వెక్కెక్కి ఏడుస్తూ.



రాజన్నకు జాలికలిగింది. ఆ చెప్పులు తనకెంత ఆనందం కలిగించినా, అకలి దప్పుల్నే జయించగలిగినట్టుచేసినా, తనవి కానప్పుడు అట్టేపెట్టుకోవడం తప్పు అని గ్రహించాడు. వెంటనే చెప్పులను ఆ కుర్రాడికిచ్చి బుజ్జగించాడు. నవ్వుతూ, కేరింతలుకొడుతూ, ఆ కుర్రాడు ఆ చెప్పుల జత కాళ్లకు తొడుగుకుని వెళ్లిపోయాడు.

మరుక్షణాన్నుంచి రాజన్నను మళ్లీ అన్ని బాధలూ చుట్టుముట్టినై. పూర్వంకన్న ఆకలి ఎక్కువైంది. దిగాలుపడి ఆ కుర్రాడు వెళ్ళినవైపుకే కాసేపుచూసి తిరిగి తన కష్టాలకు అంతంలేదని వాపోవసాగాడు.

మరుసటిరోజునా అదేవేళకు రాజన్న గొడ్లను తుమ్మలబీటికి తోలుకొచ్చాడు. ఈ రోజునకూడా ఎండా, వడగాలీ వేధిస్తూనేవున్నయ్. సొమ్మసిల్లుతూన్న శరీరాన్ని అదే తుమ్మచెట్టుకిందకు చేర్చి రాజన్న అటూ ఇటూ చూడసాగాడు. ముందటిరోజులాగానే యీ నాడుకూడా ఆ వింతచెప్పుల జోడు అక్కడ కనపడవొచ్చని అతడి ఆశ.

ఏటికట్టమీద లేచిన సుడిగాలి ఎండుటాకులూ, చెత్తాచెదారంతో బరువెక్కి, పల్లంలోవుండే తుమ్మలబీట్లోకి డిగి, అల్లకల్లోలంగా తిరుగుతూ రాజన్నను చుట్టుముట్టింది. అతడు ఆ గాలి తాకిడికి ఉక్కిరిబిక్కిరై కళ్ళు మూసుకున్నాడు. తిరిగి కళ్ళు తెరవగానే ఎదురుగా చక్కని కుచ్చు టోపీ వుండటం కనిపెట్టాడు.

ఒక్క అంగలో టోపీ చేతతీసుకుని తలమీద పెట్టుకున్నాడు. ఉత్తరక్షణంలోనే ఆకలీ, బడలికా మాయమయినై. "ఒహో! ఏమి నా అదృష్టం" అనుకొంటూ రాజన్న వుప్పొంగిపోయాడు. పాపం! అదే సమయంలో ఒక వృద్ధుడు వచ్చి—

"అబ్బాయ్! నాటోపీ నాకిచ్చేయ్! సుడిగాలికి నా తలమీంచి ఎగిరి యిటు

వచ్చింది" అన్నాడు. రెప్పపాటుకాలం రాజన్నకు "ఇద్దామా? వద్దా?" అన్న సందేహం కలిగింది. ఇవ్వకపోయినా వృద్ధుడు తననేమీ చేయలేడని అతడికి తెలుసు. అయినా అతడిహృదయం అటు వంటి చెడ్డతలపునకు లొంగలేదు. టోపీతీసి వెంటనే ఆ వృద్ధుడికి యిచ్చివేశాడు.

వృద్ధుడు సంతోషించాడు. "నువ్వు మంచికుర్రాడివిలా ఉన్నావు. నీకు మేలు చేస్తా. మూడు కోర్కెలు కోరుకో" అన్నాడు వృద్ధుడు.

ఆలోచన యేమీలేకండానే రాజన్న "ఐతే నన్ను రాజునుచేయండి చూదాం!" అన్నాడు. "సరే!" అన్నాడు వృద్ధుడు. "రాజు వుండేందుకు చక్కని భవనం కావాలిగదా! అదీ యివ్వండి!" అన్నాడు. "సరే!" అన్నాడు వృద్ధుడు. "రాజు గుర్రంమీదతప్ప ఎక్కడికీ కదలకూడదే. కనక, మాంచి గుర్రాన్నికూడా యివ్వండి!" అన్నాడు రాజన్న. ఇందుకుకూడా "సరే!" అన్నాడు వృద్ధుడు.

చూస్తూ చూస్తూ వుండగానే రాజన్న కోర్కెలన్నీ ఫలించినై. రాజోచితమైన దుస్తులూ, కిరీటం; ఎదుట చక్కని రాజప్రాసాదం, ప్రక్కనే పంచకళ్యాణి వంటి తెల్లని గుర్రం కదంతొక్కుతూ వుండడం అన్నీ క్షణాలమీద జరిగిపోయినై.

రాజన్న సంతోషంతో గుర్రంమీదకు గెంతి, సగర్వంగా రాజప్రాసాదంవద్ద దిగి, లోపల ప్రవేశించాడు. మంత్రులూ, సామంతులూ, వందిమాగధులూ జయ ధ్వానాలు చేశారు. వృద్ధుడుమాత్రం ఆ ప్రాంతాల మళ్ళీ ఎన్నడూ కనబడలేదు. రాజన్న సౌశీల్యమే అతడికి ఇటువంటి ఐశ్వర్యాన్ని ప్రసాదించిందని లోకులు చెప్పుకొని సంతోషించేవాళ్లు.



# పోలీసుకి ఎలా తెలిసింది

చెన్నపట్టణం షావుకారుపేటలో కరంచంద్ కబీర్ అనే వజ్రాల వర్తకుడు కొన్ని లక్షలు ఆర్జించాడు.

ఒకరోజున కబీరుకు ఒక ఉత్తరం వచ్చింది: 'ప్రియమైన కరంచందూ!— నేను నిన్న ఉదయమే మద్రాసు వచ్చాను. చెంగప్పనాయికరు వీధి 127-వ నెంబరు ఇంటిలో దిగేను. మీయింటికి రాక ఎక్కడో దిగడమేమిటి అని నీకు నామీద కోపం రావచ్చు. కాని నేను వచ్చినపని ఈ వీధి వాళ్లతోనేగనక ఇక్కడ మకాంచెయ్యవలసి వచ్చింది. నిన్ననే వచ్చి నిన్ను చూద్దామనుకున్నానుగాని, నాకు జ్వరంతగిలి ఎక్కడికీ కదలలేకుండా ఉన్నాను. ఒక్కమాటు వెంటనేవచ్చి చూసివెళ్ళు.— కె. సోహనలాలు' అని వున్నది అందులో.

ఆ ఉత్తరం చదువుకున్న కబీరుకి, తన బాల్యస్నేహితుడైన సోహనలాలు వచ్చాడన్న సంతోషం, ఐతే జ్వరంలో ఉన్నాడన్న విచారం, అతణ్ణి తీసుకొచ్చి తన భవనంలో ఉంచి మందు ఇప్పించాలన్న ఆదుర్దా, అన్నీ ఒక్కమాటుగా కలిగాయి. అతడు వెంటనే మోటారుమీద బయల్దేరి, సొంతంగానే డ్రైవుచేసుకుంటూ చెంగప్పనాయికరు వీధి ఎక్కడున్నదో అని వెతుక్కుంటూ వెళ్ళాడు.

చెంగప్పనాయికరు వీధి అన్నది అసలు ఒకవీధి అనటానికే వీల్లేదు. ఒక ఇరుకైన చిన్నసందు. కబీరు కారు ఆ సందులో పడుతుందా లేదా అన్నంత ఇరుకుగా ఉన్నదది. మద్రాసులో అలాంటి సందులు చాలా ఉన్నాయి. వాటిల్లో కార్లూ బళ్లూ ఒకదానికొకటి ఎదురుగా వస్తే తప్పుకోటానికి గాని, వెనక్కి మళ్ళటానికి కాని వీలు ఉండదు. వచ్చిపోయే జనానికి ఇరకాటకం అవుతుంది. అందుకనే అలాంటి సందు

అల్లంరాజు చినలక్ష్మీపతి - గొల్లప్రోలు




లలో కార్లూ బళ్ళూ ఒకవైపునుంచే ప్రవేశించి రెండోవైపునుంచి పోవాలిగాని రెండు వైపులా ప్రవేశించటం రెండువైపులా పోతూ వుండటం పనికిరాదని నోటీసుబోర్డులు కడతారు.

"ప్రవేశించకూడదు" అన్న బోర్డు చెంగప్పనాయకరు వీధిలో ఆమొగిని ఉంది. కాని, కబీరు తన హడావుడిలో దాన్ని గమనించకుండానే కారును ఆ మొగిలో నించి పోనిచ్చాడు. తలుపు నెంబర్లు చూసుకుంటూ మెల్లిగా నడుపుకొంటూ వచ్చి, 127 నెంబరు గుమ్మానికి ముందుగా కారు ఆపి, గుమ్మంయొక్క లోపలకి వెళ్లేడు.

నీలిఅద్దాల కళ్లజోడు ధరించిన పొడుగాటి మనిషి ఒకాయన ఎదురువచ్చి, 'దయచెయ్యండి. కబీరుగారూ!' అంటూ లోపలకి తీసుకుపోయాడు. ఆ మనిషి వెనకాలే వెళ్లి, వాడు చూపించిన ఒక కుర్చీలో కూచున్నాడు. ఆ మనిషి తలుపుగడియ బిగించివచ్చి, కబీరుకు ఎదురుగా ఉన్న రెండో కుర్చీమీద కూర్చున్నాడు. 'ఏడీ సోహనలాలు, ఎక్కడున్నాడు? జ్వరం ఎలా ఉంది?' అని అడిగాడు కబీరు. ఆ మనిషి విషపునవ్వునవ్వి, 'నేనే ఆ సోహనలాలుని! నాకే ఆ జ్వరం వస్తే! మిమ్మల్ని ఇక్కడికి రప్పించటానికే ఆ జ్వరం వచ్చింది!' అన్నాడు. కబీరుకి ఆశ్చర్యంవేసింది. అనుమానమూ కలిగింది. 'లాహోరులో చిన్నప్పుడు నన్ను ఎరిగివున్న సోహనలాలువచ్చి, ఆ ఉత్తరం రాశాడనుకున్నాను' అన్నాడు.

'మీ లాహోరుస్నేహితుణ్ణి నేను బాగా ఎరుగుదును. ఆయన దస్తూరీకూడా నాకు తెలుసు. అందుచేతనే ఆ ఉత్తరాన్ని మీకు ఆయన రాసినట్టు రాయకలిగాను' అన్నాడు సోహనలాల్.

"ఎలాఎరుగుదువు? మోసంచేసి నన్నెందుకు రప్పించినట్లు?" అనడిగాడు కబీర్.

'మిమ్మల్ని ఎరగటానికేముందిలెండి. ఎక్కడెక్కడ ధనవంతులున్నారో వాళ్లందరూ నా జాబితాలో ఉన్నారు. మిమ్మల్ని ఇక్కడికి రప్పించటానికి కారణం మీ మీద ప్రేమచేత గాదు; ఇప్పుడు మీరు సంతకం చేసి నాకు ఇవ్వబోయే మీ చెక్కు మీదఉండే అబిమానంకొద్దీని!' అన్నాడు అతడు.

కబీరుకి వళ్లుమండి, 'ఏమిటీ! ఇంత ద్రోహమా?' అంటూ లేచాడు. సోహనలాలు ముఖం వికృతంగా మారిపోయింది. వాడు పంట్లాంజేబులోంచి చటుక్కుమని పిస్తోలు తీసి, కబీరుగుండెకు గురిపెట్టి, 'కబీర్, అరిచావంటే పేల్చేస్తా!' అన్నాడు. కబీరు నిర్ఘాంతపోయి, నిలబడ్డవాడల్లా కుర్చీలో కూలపడిపోయాడు.

ఒక్కక్షణం అంతా నిశ్శబ్దం ఆవరించింది. కపట సోహనలాల్ ముఖం మళ్లీ మామూలు విషపునవ్వుతో వికసించి, వాడు మెల్లిగా, 'కబీరుగారూ, మీరు వృథాగా కాలయాపన చెయ్యక, ఆ చెక్కు ఎంత త్వరగా సంతకంపెట్టి ఇస్తే, అంత మంచిది. కాస్సేపటిలో మా రంగోజీ వస్తాడు. వాడా చెక్కు బ్యాంకుకు తీసుకుపోయి మార్చి సొమ్ము తీసుకుంటాడు. ఆ సొమ్మంతా




నోట్లరూపంలో మావద్ద ఉండటం క్షేమం కాదుగనక, ఆ నోట్లతో బంగారపుకాసులు కొనేస్తాడు. దీనికంతా కొంతసేపుపడుతుంది గదా. సొమ్ము బంగారంగా మారేవరకూ మీరిక్కడనే ఉండిపోవాలి. మీరు త్వరగా విడుదల అవాలీ అంటే కాలయాపనచేయక ఆ చెక్కు రాసి ఇవ్వండి' అన్నాడు.

'నేను నా చెక్కుబుక్కు నీకోసమని కూడా తెచ్చానా మరి?' అన్నాడు కబీరు.

కపట సోహనలాలు మళ్లీ ఒకమాటు విషపునవ్వు నవ్వి, 'ఆ జాగ్రత్త నేను పడ్డానులెండి. మీ ఆఫీసులో నా మనిషిని ఒకణ్ణి నౌకరీకి ప్రవేశపెట్టించాను. మీ



చెక్కు బుక్కును వాడిచేత మీ కోటు జేబులో పెట్టించాను. మీరు ఆఫీసుకు వెళ్ళటంతోనే కోటుతీసి కొయ్యకు తగిల్చి ముఖం కడుక్కోడానికి మరోగదిలోకి వెళ్ళటం మామూలని మాకు తెలుసు. ఆసమయంలో ఈ ప్రొద్దుట చెక్కుబుక్కు మీ జేబులోకి వచ్చేసింది' అన్నాడు. కబీరు జేబు తడుముకునేటప్పటికి, చెక్కుబుక్కు చేతికి తగిలింది.

'ఎంతద్రోహం!' అనుకుంటూ ఆయన చెక్కుబుక్కు తీశాడు. యాభైవేల రూపాయిలకీ చెక్కురాసి సంతకంపెట్టి, కపట సోహనలాలుకి అందిచ్చాడు. కపట సోహనలాలు మళ్ళీ ఆ విషపునవ్వు నవ్వుతూ 'మిష్టర్ కబీర్, మీరు ఏలాగైనా బుద్ధిమంతులండి! మూర్ఖంగా కాలయాపన చెయ్యక, చెప్పటంతోనే పరిస్థితులు అర్థం చేసుకుని చెక్కురాసి ఇచ్చేశారు!' అని మెచ్చుకున్నాడు.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడైంది. 'అడుగో రంగోజీ వచ్చాడు. ఎందుకో అంత గట్టిగా బాదుతాడు. నాకు అకాత్తుగా చెముడు పట్టుకుంది అనుకున్నాడుగామోసు!' అంటూ కపట సోహనలాలు లేచి, 'కబీరు గారూ, ఇప్పుడు నేను వెళ్ళి వాడికి తలుపు తియ్యాలి. నేను మొగం అటుతిప్పగా చూసి, మీకు, నా వెనకనుంచివచ్చి నామీద పడి నన్ను చంపాలనో, కొట్టాలనో, కోరిక పుట్టవచ్చు. మీకు అటువంటి వృథాశ్రమా, అవకాశం కలగకుండా, మీరు నాముందే ఆ తలుపుదాకా నడవాలి!' అన్నాడు. గత్యంతరంలేక కబీరు తలుపువద్దకు నడిచి వెళ్ళేడు. కాస్త వెనకాలే కపట సోహనలాలు వెళ్ళేడు.

'తలుపుతియ్యండి కబీరుగారూ. తీసి పారిపోవటానికి మాత్రం వృథాప్రయత్నం చెయ్యకండి. ఏమంటే ఒక్క అడుగు




మీరు అవతలపెట్టేరూ అంటే రంగోజీ మిమ్మల్ని పిస్తోలుతో కాల్చేస్తాడు!' అన్నాడు కపట సోహనలాలు. 'ఆరి దుర్మార్గుడా! ఎన్నియేర్పాట్లు చేశావురా!' అని మనస్సులో అనుకుంటూ విధిలేక తలుపుతెరిచాడు కబీరు. గుమ్మానికడ్డంగా పిస్తోలు పుచ్చుకుని సిద్ధంగా ఆ రంగోజీ ఎవడో అక్కడ ప్రత్యక్షం అవుతాడనుకున్నాడు కబీరు. కాని రంగోజీకి బదులు జమాజట్టీలవంటి పోలీసువాళ్లు నలుగురు ప్రత్యక్షమై, తలుపు తెరవటంతోనే లోపలకి ప్రవేశించారు! కపట సోహనలాల్ వాళ్లని చూడటంతోనే నిర్ఘాంతపోయాడు. వాడి చేతిలో ఉన్న పిస్తోలు వాడికి తెలియకుండానే జారి క్రిందపడి 'ఢాం' అని పేలింది.

పోలీసువాళ్ళుకూడా నిర్ఘాంతపోయి చూస్తోంటే కబీరు 'వేడుక చూస్తారేమిటి? పట్టుకోండి హంతకుణ్ణి!' అని అరిచాడు. వాళ్ళునలుగురూ సంగతి ఏమిటో తెలియకుండానే కపట సోహనలాల్‌ని పట్టుకున్నారు. నేరస్థునితోసహా వాళ్ల నలుగుర్నీ కారులోకి ఎక్కమని కబీరు పోలీసు స్టేషనుకు కారు పోనిస్తో, 'ఐతే ఈ దుర్మార్గుడు లోపల నన్ను చెక్కు ఇవ్వవలసిందని నిర్బంధిస్తోన్నట్లు మీకు ఎలాగ తెలిసింది?' అని అడిగేడు.

పోలీసులు మళ్ళీ నిర్ఘాంతపోయి, "మిమ్మల్ని వీడు నిర్బంధించాడా? మాకా సంగతి ఏమీ తెలియనే తెలియదు! ఈ కారుముఖం ఇటువైపు ఉండటంచూసి, రూల్సుకి వ్యతిరేకంగా సందులోకి వచ్చినందుకు కేసుపెట్టాలని కారునెంబరు నోటు చేసుకున్నాం. కారు ఆ యింటికి ఎదురుగా ఆగిందిగనక కారుయజమాని ఆ యింట్లోకి వెళ్ళిఉంటాడని తోచి అక్కడ మీకోసం కొంతసేపు కనిపెట్టుకున్నాం. దారిన వచ్చి

ఎవడో అ గుమ్మం ఎక్కబోయాడుగాని ఎందుచేతనో వచ్చినదారినే వెళ్ళిపోయాడు. అయన్ని ఆపి, 'ఎవరిదీ యిల్లు? ఈ కారు ఎవరిది?' అని అడిగేం కాని అయన 'నాకు తెలీదు. నేను ఒక గుమ్మం ఎక్కబోయి ఒక గుమ్మం ఎక్కేను!' అంటూ చక్కాపోయాడు. మేం ప్రాణంవిసిగి, కారు యజమాని ఎవరో తెలుసుకుని పేరు రాసుకుపోపటంకోసం అ తలుపు తట్టాము. వీడు మమ్మల్ని చూసి వెలవెలపోవడం, పిస్తోలు కిందపడి పేలడం, మీరు వీణ్ణి పట్టుకోమంటే మేము పట్టుకోడం జరిగిందే కాని అసలు సంగతేమిటో మాకు మీరు చెప్పేదాకా తెలియదు' అన్నారు.

కబీరు అంతావిని కపటసోహనలాల్‌కేసి చూసి, 'చూశావా, నువ్వు ఎంతో కట్టుదిట్టమైన వ్యూహం పన్నాననుకుంటే చివరికి నీపాపం ఎలా పండిపోయిందో! అ బోర్డు చూసుకోకుండా సందును అమొగనుంచి ప్రవేశించి నేను నేరంచేస్తే అనేరం నన్ను నీచేతుల్లోంచి రక్షించింది. దేముడిచర్యలు ఎంత చిత్రంగా ఉంటాయి!' అన్నాడు. తర్వాత కబీరు, పోలీసులతో 'అ గుమ్మం ఎక్కబోయి మిమ్మల్ని చూసి తప్పించుకుపోయినవాడు బహుశా వీడి స్నేహితుడు రంగోజీ అయివుంటాడు. వాణ్ణి మీరు చూసేవున్నారు గనక, వెతికిపట్టండి' అంటూ పోలీసుస్టేషను దగ్గిర కారు ఆపి, కపటసోహన్‌లాలుని లాకప్‌లో పెట్టించి వెళ్లిపోయాడు.

తరువాత పోలీసువాళ్ళు రంగోజీనికూడా పట్టారు. కపటసోహనలాలుతో లాలోచీ అయి, కబీరుజేబులో ఆయనకు తెలియకుండా చెక్కుబుక్కు పెట్టినవాడూ పట్టుబడ్డాడు. ముగ్గురూకూడా పాతనేరగాళ్లే అని తేలింది. ముగ్గురికీ కఠినశిక్షలు పడినై.






పంచపాండవులలోకల్లా పెద్దవాడైన ధర్మ రాజు వాక్శుద్ధికలవాడు. ఎన్నడూ అసత్యం పలికి ఎరుగడు, ధర్మంతప్పి చరించడు. ఆయనమాటకు తిరుగులేదు. అందుచేతనే తమ్ములు నలుగురూ అన్నగారి మాటను వేదవాక్కుగా మన్నిస్తూ ఉండేవారు.

ధర్మరాజు తమ్ములకు ఎల్లప్పుడూ ఇలా హితవు చెబుతూ ఉండేవాడు: 'ఇవాళ చేయవలసిన పని ఇవాళనే చేసివేయండి. వాయిదా వేయకండి. శరీరాలు అస్థిరాలు. మరుక్షణం మనదికాదు' అని. ఈ మాటలను తమ్ములు అక్షరాలా అమలుచేస్తూ ఉండేవాళ్ళు.

ఇలావుండగా ధర్మరాజు రాజసూయ యాగం చేయాలని సంకల్పించాడు. సన్నాహాలన్నీ క్షణాలమీద జరిగిపోయినై. సామంతరాజులందరకూ పిలుపులు వెళ్లగా, వాటిని అందుకుని అందరూ హస్తినాపురం చేరుకున్నారు. వచ్చినవారందరకూ అతి వైభవంగా ఉచితరీతిని గౌరవ మర్యాదలు జరుగుతున్నయి. అంతలో శ్రీకృష్ణభగవానుడు విచ్చేశాడు. ఈ సంగతి తెలియగానే ధర్మరాజు ఆనంద భరితుడయ్యాడు. స్వయంగా ఎదురువెళ్లి కృష్ణుణ్ణి తోడితెచ్చి, తన అంతఃపురానికి తీసుకవెళ్లాడు.

శ్రీకృష్ణ, ధర్మజులు అంతఃపురంలో ముచ్చటించుకొంటూవుండగా భీమసేనుడు ద్వారందగ్గిర కాపలా ఉన్నాడు.

ఆ సమయంలో వృద్ధుడొకాయన ధర్మ రాజు దర్శనంకోసం వచ్చాడు. 'అంత కొంపమునిగే పనేమిటి? మళ్ళీ రాకూడదా? అన్నయ్యగారిప్పుడు పెద్దమనుష్యులతో మాటాడుతున్నారే' అన్నాడు భీమసేనుడు.

అందుకు బ్రాహ్మడు 'ఇంకానయం, కొంపమునిగే పనికాదా మరి. బాగానే అడి

యస్. కోమల - విజయనగరం



గావు! రేపులేదు ఎల్లుండే మా అమ్మాయి పెళ్ళిముహూర్తమయిందే. ఇల్లు చూడబోతే అయ్యావార్లంగారి నట్టిల్లులాగా వుండె. పోనీ అంటే కాస్తంతయినా వ్యవధిలేదు. ఈ అదును గడపటానికి ధర్మరాజు ఒక్కడే సమర్థుడు' అంటూ తను వచ్చినపని చెప్ప గానే, భీముడు అభ్యంతరం చెప్పక ఆ బ్రాహ్మణ్ణి లోపలికి వదిలాడు.

లోపలకు వెళ్ళిన కొద్దిసేపటిలోనే బ్రాహ్మడు కలకలలాడే ముఖంతోనూ, తృప్తిపడిన మనసుతోనూ ఇవతలకు వచ్చాడు. అయితే, ఆయన చేతిలోమట్టుకు ఏమీ ఉన్నట్టు కనబడలేదు.

భీమసేనుడు ఉండబట్టలేక, వెళ్లిపోతూ వున్న ఆ వృద్ధ బ్రాహ్మణ్ణి ఆపి 'ఏమండీ, మీ రొట్టె నేతిలో పడినట్టుందే?' అని పలకరించాడు. బ్రాహ్మడు నవ్వుతూ, 'పడకేమి? ధర్మరాజు దర్శనం చేసుకోవ టమూ, ఊరికేపోవటమూనా?' అంటూ ఎదురుప్రశ్నవేసి జవాబుచెప్పాడు.

అప్పుడు భీమసేనుడు 'మరైతే, ఉత్త చేతులతో వెళుతున్నారే!' అని అడిగాడు. అందుకు వృద్ధ బ్రాహ్మడు 'ఉత్తచేతు లేమిటి? ఉదయానే రమ్మన్నారు. రావటం, సామగ్రి పట్టుకవెళ్ళడమే తరువాయి' అని చెప్పి బ్రాహ్మడు వెళ్ళిపోయాడు.

బ్రాహ్మడు చెప్పిన ఈ మాటలు భీమ సేనుడికి ఆశ్చర్యం కలిగించినై. తీవ్రంగా యోచించాడు. అతని మనసులో ఏదో మెరపు మెరసినట్టయింది. తక్షణమే నగారా వాడిని పిలిపించి, జయభేరీలు మోగించ మన్నాడు. దిక్కులు పిక్కటిల్లేలాగ జయ భేరీలు మోగినై.

ఏదైనా రాజ్యం గెలుచుకుని, విజయం కలిగినప్పుడు ఇలా జయభేరీలు మోగిస్తారు. 'ఇదేమిటి చెపుమా, తలపనితలంపుగా ఇప్పుడు భేరీ మోగుతున్నదే!' అని ధర్మ




రాజు విస్తుపోయాడు. పక్కని కూర్చునివున్న శ్రీకృష్ణుడూ ఆశ్చర్యం నటించాడు.

వెంటనే ధర్మరాజు తమ్ముణ్ణి పిలిపించి 'ఇదేమిటి తమ్ముడూ, ఇప్పుడు నగారామోత యేమిటి? వినోదంకోసం ఇలా చేయవచ్చా? నలుగురూ నవ్వరా?' అని మందలించ బోయాడు.

అందుకు భీమసేనుడు వినయంగా, "అన్నయ్యా!—ఈనాడు మనం సాధించి నటువంటి విజయం, నిజానికి విలువ కట్టరానిది. ఎలా అంటే: మీరు ఆడితప్పి ఎరుగరు. మీకుగల వాక్శుద్ధి జగద్విదితమే. పోతే, ఇందాక యాచింపవచ్చిన ఆ వృద్ధ బ్రాహ్మణుణ్ని మీరు రేపు ఉదయానే రమ్మని సెలవిచ్చారుకద. అనగా, మీ మాటప్రకారం ఆ బ్రాహ్మడూ, ఆయన కుటుంబమూ, ఇక్కడ మనమూ—అంతా రేపటివరకు క్షేమంగా ఉంటాముకదా! మన భాగ్యభోగ్యాలు చెక్కుచెదరకుండా ఇల్లానే ఉంటాయికదా! మన మనస్సులు మారకుండా నిలకడగా వుంటాయనే హామీకూడా మీ వాగ్దానంలో ఇమిడివున్నదికదా! అనగా అస్థిరమైన ఇంతమంది శరీరాలు రేపు ఉదయంవరకూ మృత్యువాత పడకుండా అభయం ఇచ్చారన్నమాట. చంచలమైన లక్ష్మికి కొద్దిసేపైనా స్థిరత్వం కూర్చారన్న మాట. అన్నయ్యా! ఇంతకంటె సాధించ గల విజయాలు జీవితంలో మరేమిటి ఉంటాయి? ఈ సంతోషం పట్టలేక నేనే విజయభేరీ మోగించమన్నాను. తప్పంటే మన్నించండి' అన్నాడు.

పొరపాటు గ్రహించి ధర్మరాజు చిన్న బుచ్చుకొన్నాడు. తమ్ముడైన భీమసేనుణ్ణి మరొక్క మాటయినా అనలేదు.

ఈ సంఘటన కంతటికీ కారకుడైన శ్రీకృష్ణభగవానుడు భీమసేనుడివైపు కొంటెగా చూచి చిరునవ్వు నవ్వాడు.




బరంపురంలో పరంధామయ్య అనే ధనవంతుడొకడు ఉండేవాడు. ధనవంతుడే కాదు, ఆయన విద్యావంతుడుకూడాను.

కాలేజీలో చదివేటప్పుడు సూట్లూ, బూట్లూ వేసేవాడుగాని క్రమంగా ఆ వేషం మానేసి, మనదుస్తులే వేసుకుని, అకుజోడు తొడుగుతూ వచ్చాడు.

ఒకమారు ఆయన మద్రాసు వెళ్లవలసి వచ్చింది. ఎప్పుడూ ఫస్టుక్లాసులోనే ప్రయాణంచేసేవాడు. ఆ రోజుకూడా ఫస్టుక్లాసు టిక్కట్టు కొనుక్కుని మద్రాసు మెయిల్లో ఎక్కాడు.

ఆ మొదటితరగతి పెట్టెలో ఒక ఇంగ్లీషువాడు ఉన్నాడు. పరంధామయ్య పంచె కట్టూ అకుజోడూ చూసేసరికి, ఆ పెట్టెలో తెలియక పొరబాటున ఎక్కుతున్నాడేమో అనిపించింది లోపలున్న దొరగారికి. "ఇది ఫస్టుక్లాసు!" అంటూ ఆయన్ని అటకాయించాడు. "ఔను; నేనూ ఫస్టుక్లాసు ప్యాసెంజర్నే!" అంటూ లోన ప్రవేశించాడు పరంధామయ్య. దొరకు ఒకవిధమైన ఉడుకుమోతుతనం బయల్దేరింది. పరంధామయ్య బెంచీమీద బిచాణా పరుచుకుని, దానిమీద కూచుని, తన అకుజోడు బెంచీ క్రింద వదిలేశాడు. దొరకి ఆ జోడుచూస్తేనే అసహ్యంవేసింది. "నా బూట్ విడవకుండా ఎలాగ తొడుక్కున్నానో చూడు" అన్నాడు.

పరంధామయ్యకి అరికాలిమంట నెత్తికెక్కింది. "మిష్టర్!–మర్యాదా, నాగరికతా నాకూ తెలుసు. నేను మీదేశమంతా తిరిగి వచ్చాను. అక్కడ మర్యాదస్థులెవరూ ఇలాగ ప్రవర్తించలేదు. మీకుమల్లే మాకు అస్తమానం జోడు అవసరంలేదు" అని వాతపెట్టినట్లు బదులు చెప్పేడు.

దొరకి బాగా కోపంవచ్చింది. బెంచీకింద అకుజోడు చూస్తోన్నంతసేపూ అతడికి

జె. పళ్లంరాజు - కడప

కంపరం ఎత్తిపోయింది. పరంధామయ్యాని ఎలాఐనా పరాభవం చెయ్యాలన్న పట్టుదల బయల్దేరింది. పరంధామయ్యా పత్రిక చదువుతూ కునుకుతీశాడు. అప్పుడు దొరగారు స్వహస్తంతో పరంధామయ్యా జోడును ఎత్తి రైలుకిటికీలోంచి అవతలకు విసిరేసి, ఏమీ ఎరగనట్లు తన మానాన తను పత్రిక చదువుకోటం ప్రారంభించాడు.

ప్రక్క స్టేషన్లో మెయిలు ఆగింది. పరంధామయ్యాకి మెలకువ వచ్చింది. లేచి ఆకుజోడుకోసం చూశాడు. పెట్టిన చోట కనబడలేదు. అటూ ఇటూ పరికించాడు. పరంధామయ్యా పోయినజోడుకోసం వెతుక్కుంటూాండడం కనిపెట్టి దొర ముసిముసి నవ్వులు నవ్వసాగాడు! దొర్జాలకం గ్రహించుకున్నాడు పరంధామయ్యా. పైకి మాత్రం మనస్సు వెల్లడించలేదు.

ఎవరిమానాన్ని వాళ్ళు ఒక గంటసేపు మౌనంగానే వున్నారు. దొరకి అగత్యంకలిగి తన ట్వీడ్డుకోటును విప్పి బెర్తుమీద పడేసి అవతలకి వెళ్ళాడు. ఆసమయంలో పరంధామయ్యా లేచి, ఆ కోటు కిటికీలోంచి విసిరి పారవేశాడు. ఆ ట్వీడ్డు కోటు, దానిలో వస్తువుల విలువ ఎనభై రూపాయలదాకా వుంటుంది. అలాంటి కోటుని నిస్సంకోచంగా ధైర్యంగా పరంధామయ్యా పారవేశాడు.

దొర వచ్చాడు. కోటు కనబడలేదు. ఉగ్రుడైనాడు. "నాకోటు ఏదయ్యా?" అని గద్దించి అడిగేడు పరంధామయ్యాను.

పరంధామయ్యా పేపరుమీదేదృష్టిఉంచి, తొణకకుండా బెణకకుండా అతి నిదానంగా 'ఏమిటి మిస్టర్! - మీ కోటా? బహుశా నా చెప్పులు వెతకటానికనిగానే వెళ్లిందేమో!" అన్నాడు.

దొరకి బలే కోపంవచ్చింది. అప్పటికే పరంధామయ్యా లాల్చీ పైకితీసి తయారులో ఉన్నాడు. అతడి జబ్బపుష్టి చూడగానే హడలుపుట్టి దొర వెనక్కి తగ్గేడు.






కర్ణాటకదేశంలో కర్కోటకయ్య అనే రైతు ఒకడు ఉండేవాడు. వాడిది దయా దాక్షిణ్యమూ లేని రాతిగుండె. దానికితోడు వాడు మంచిచెడ్డలు తెలియని మూర్ఖుడు కూడాను. వాణ్ణిచూస్తే పిల్లలకి భయమూ, పెద్దలకి అసహ్యమూ వేసేది.

తొలకరించటంతోనే రైతులంతా తమ చేలను దున్ని దమ్ముచేయటానికి నాగళ్ళు బుజాన వేసుకుని ఎడ్లజతలను తోలుకెడుతున్నారు. కర్కోటకయ్యకూడా నాగలి బుజంమీద వేసుకుని ఎడ్లకోసం పాకలోకి వెళ్ళేడు. వాడికి ఒక్క జత ఎడ్లే ఉన్నాయి. వాడు పాకలో ప్రవేశించేసరికి ఒక ఎద్దు నిలబడి ఉంది. రెండోది పడుకుని ఉన్నట్లు కనపడింది. దాన్ని ములుగర్రతో పొడిచి "ఎహేయ్!" అన్నాడు. కాని ఆ యెద్దు లేవలేదు. లేవటానికి అది బ్రతికి ఉంటేగా? రాత్రి ఎప్పుడో వాతంకమ్మి చచ్చిపోయింది.

అరక లాగటానికి రెండుపక్కలా రెండెడు కావాలిగదా. చచ్చిపోయినదాని స్థానే ఎద్దు ఎక్కణ్ణుంచి వస్తుంది! ఎవడైనా ఎరువు ఇస్తాడేమో అంటే తనంటే ఎవరికీ కిట్టదాయె. కొత్త ఎద్దుని కొందామంటే డబ్బేదీ? ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు కర్కోటకయ్య. ఆలోచిస్తో నిలబడేసరికి వాడి పెండ్లాం భూదేవమ్మ పెంట పారబొయ్యటానికి పెరట్లోకి వచ్చింది. ఆమెను చూడ్డంతోనే కర్కోటకయ్యకి ఒక ఆలోచన తోచి, 'ఒసేవ్, పాలంరా. పనుంది' అన్నాడు. భూదేవమ్మ మహా పతివ్రత. "ఎందుకు?" అని అడగకుండా మొగుడు రమ్మనగానే చేట అక్కడ పడవేసి, భర్త వెనకాలే వెళ్ళింది.

కుమారి డి. ఇందుమతి - మథుర (యు. పి.)

బ్రతికివున్న ఎద్దుతోటీ భార్యతోటీ కర్కోట కయ్య పొలంచేరుకుని ఒకవేపు అరకకి ఎద్దును కట్టి రెండోవేపు కాడిని భూదేవమ్మ మెడమీదపెట్టి, 'ఎద్దుతో సమానంగా లాగాలిసుమా!' అన్నాడు. భూదేవమ్మ 'కిం' అనకుండా ఎద్దుతో సమంగా, ముంగాళ్లకుమల్లే చేతులు భూమిపైన అన్చి అరక లాగటం ప్రారంభించింది. కాని అలా పాపం, ఎంతసేపని లాగగలదు?

పదిబారలు లాగేసరికే ఆమెకు ఆయాసం వచ్చింది. మెడపైన నాగటికాడి అనగానే అక్కడి చర్మం ఊడి పోయి, గాయమై ఊరుకుంది. ఎద్దుతో సమంగా లాగలేక పోతూందని కర్కోటకయ్య, జ్ఞానంలేకుండా ఆమెనుకూడా ములుగర్రతో పొడిచి తోలటం మొదలెట్టేడు. వాడు అలాపొడిచినచోటల్లా ఆమెకు గాయమై సహించలేకపోయింది.

ఆ కాలంలో ఆ దేశాన్ని సౌజన్యనిధి అనే మంచిరాజొకడు పాలించేవాడు. ఆయన తన ప్రజల యోగక్షేమాలను తెలుసుకు రావటంకోసం స్వయంగా గుఱ్ఱంమీద బయల్దేరి సంచారం చేస్తూండేవాడు. అనాడు ఆయన కర్కోటకయ్య పొలం పక్కనించి పోతూ భూదేవమ్మ మూలుగు



వినిపించి, ఆగేడు. ఆయనకు ఆ ఘోర దృశ్యం చూసేసరికి గుండె నీరైపోయింది. మరొక రాజైతే కర్కోటకయ్యను వెంటనే కొరతనువేయించేవాడే! కాని ఆయన వాడి దగ్గరకెళ్ళి సౌమ్యంగా, 'అబ్బీ, ఈమెను వదిలెయ్యి. నీకు రెండోఎద్దు లేకపోతే నేను కొని ఇస్తాను' అన్నాడు. అంటూనే తన నౌకరుచేతులో ఒక వరహాలమూట పడేసి ఎద్దుకోసం పంపేడు. భూదేవమ్మతో, 'అమ్మీ, నువ్వు ఇంటికి పోయి ఆ గాయాలకేమైనా మందు వేసుకో. నీ భర్తకి ఒక్క అర గంటలో మా నౌకరు మంచి ఎద్దునొకదాన్ని కొనితెస్తాడులే' అని చెప్పాడు.



ఆమె మెల్లిగా లేచి వెళ్ళబోతూంటే కర్కోటకయ్య ఏం చేశాడనుకున్నారు! రాజుకు కృతజ్ఞత కనపర్చటానికి బదులు మండి పడుతో, 'కొత్త ఎద్దు వచ్చేదాకా అరక ఆపుకొని నిలబడనా నేను! ఈ అరగంటలోనూ అడ్డెడు నేల దున్నవచ్చునే!' అన్నాడు. వాడి మూర్ఖతకు రాజు నిర్ఘాంత పోయాడు.

సౌజన్యనిధి ఓరిమితో, 'అబ్బి, నీకు ఈ అరగంటా ఆగటానికి వీల్లేదని తోస్తే, నీ ఇల్లాలికి బదులు నేను ఈ కాడికింద మెడపెట్టి లాగుతాను!' అని మెడ ఒగ్గేడు. ఏమీ అనలేదా కర్కోటకుడు! భూదేవమ్మ మట్టుకి, 'బాబూ, వద్దు, వద్దు' అంటూ రాజుకి అడ్డురాబోయింది గాని లేవలేక కూలబడిపోయింది. కర్కోటకుడు అప్పటికే ఆలస్యమైపోయిందని విసుక్కుంటూ, ఎద్దుతో బాటు అరక రెండోపక్కని రాజు లాగుతూంటే, 'చొచ్చో' అంటూ పక్షపాతం లేకుండా ఎద్దునీ రాజునీ సమంగా ములుకర్రతో పొడుస్తూ తోలుకుపోయాడు!

భూదేవమ్మకి ఇప్పుడొక కొత్తబాధ వచ్చింది. మూర్ఖుడైన తన మొగుడు ఆ రాజుని ములుకర్రతో పొడుస్తోంటే ఆమె చూడలేకపోయింది. 'భగవంతుడా! ఈ మహానుభావుడికి పొడుకష్టం తెచ్చిపెట్టావేమిటి! ఆయనకు ములుగర్ర నాటకుండా చెయ్యి! ఆయన మెడకి నొప్పికలుగకుండా చెయ్యి!' అని ప్రార్థించింది. మహాయిల్లాలి ప్రార్థనను భగవంతుడు విన్నాడు. కర్కోటకుడు ములుగర్ర పుచ్చుకు పొడిచినా తనకి నొప్పిపెట్టకపోవడం చూస్తే రాజుకే ఆశ్చర్యం వేసింది. 'ఈమె మహా పతివ్రత!' అనుకుంటూ, ఆయన ఒక ఇరవైబారల మేర దున్నేసరికి, అంతలో కొత్త ఎద్దును తోలుకుని నౌఖరు వచ్చాడు. అప్పుడు వదిలాడు కర్కోటకుడు రాజను. గాయాలతో ఉన్న




భూదేవమ్మను, నౌకర్ని తోడిచ్చి రాజు ఇంటికి పంపించేశాడు. ఆమె వెడుతో, ఆయనను ఆశీర్వదించింది. రాజూ వెళ్ళాడు.

తక్కిన రైతులతోబాటు కర్కోటకుడు కూడా చేను ఊడ్చాడు. తక్కిన చేలకిమల్లే వాడిచేనుకూడా ఏపుగా ఎత్తుగా పెరిగింది. కాని రాజు అరక లాగినంతమేరామాత్రం పైరుబాగా కాలేదు. సుకుమారుడు కావటంవల్ల ఆయన అరక సరిగా లాగలేక, అక్కడ నాగటిచాలు మెరకైపోయి, విత్తనాలు బాగా పైరయాయి కావు. ఆ కాస్తమేరాకూడా తనకి సరియైనపంట రాలేదుకదా అని తలిచి, 'ఆ వాజమ్మమూలాన్ని నాకు నష్టం వచ్చింది! మళ్ళీ వాణ్ణి కనపడనియ్యి, అడ్డంగా నరుకుతాను!' అని పెళ్లాంముందు కేకలేశాడు. ఆమె వణికిపోయింది. 'భగవంతుడా, ఉపకారానికి వచ్చిన ఆ పుణ్యాత్ముడికి అపకారం ఎదురవుతోందే! ఆయనకి నా భర్తవల్ల ఏ ఆపదా రాకుండా కాపాడు!'మంటూ మళ్లీ ప్రార్థించింది.

మర్నాడు కర్కోటకుడు పొలం వెడుతూ, కత్తికూడా పట్టుకెళ్లేడు. రాజు కనపడితే నిజంగా నరుకుదామనే వెళ్లేడా కృతఘ్నుడు! వెళ్ళి, దూరంనుంచే యాథాలాభంగా పంటబాగా పండని రవంతమేరా ఒకమాటు చూశాడు. ఎత్తుగా ఎదగకపోయినా ఆ మొక్కలకి కొసల్ని కంకులున్నట్టు కనపడింది వాడికి. తక్కిన కంకులకుమల్లే కాకుండా అవి తెల్లగా మెరుస్తోన్నట్లు తేచి, 'ఏమిటిచెప్మా ?' అనుకుంటూ దగ్గరగా వెళ్ళేడు.

ఆ కంకుల్ని ఉన్నవి వడ్లగింజలు కావు; ఆణిముత్యాలు! కర్కోటకుడు తన కళ్లను నమ్మలేకపోయాడు! రాజును చంపుదామని తెచ్చిన కత్తి దానంతటదే కిందికి జారిపోయింది. రాజువద్దకి పరుగెత్తికెళ్లి ముత్యాలు చూపిస్తూ కాళ్లమీదపడి 'ప్రభూ, మీ

మూలాన్ని నాకు పంట నష్టమైందనుకుని మీకు ద్రోహంతలపెట్టేను! కాని చూడండి. మీరు దున్నినంతమేరా ముత్యాలు పండేయి!' అన్నాడు.

వాడిమాటలు రాజుకి అర్థం కాలేదు. సంగతేమిటో తెలుసుకుందామని భూదేవమ్మకు కబురు చేయించాడు. ఆమెవచ్చి, తన భర్తవల్ల ఏ కీడూ మూడక సౌజన్యనిధి క్షేమంగావుండటంచూసి, 'భగవంతుడు నామొర ఆలకించాడు!' అని సంతోషపడింది. 'ఏమిటి సంగతి? ఈ ముత్యాల పంట యేమిటి?' అన్నాడు రాజు అమిత ఆశ్చర్యంతో.

ఆమె 'ప్రభూ! నన్ను కనికరించి, నాస్థానే నీవు అరకను మెడకు తగిలించుకున్నావు! మాకు ఎద్దును కొనిపించి యిచ్చావు! ఐనా నాభర్త నీమేలుగుర్తించక నిన్ను చంపటానికికూడా సిద్ధపడ్డాడు! అన్ని పాపాలలోకీ కృతఘ్నతవల్లవచ్చే పాపం మహా ఘోరమైనదికదా! భర్త ఇలాంటి ఘోరనరకంలో పడిపోతూంటే ఏ యిల్లాలు చూచి ఊరుకోగలదు ప్రభూ? నాకు ఆపదలో అడ్డపడ్డ నీకు కీడు ఏమీ మూడరాదనీ, నా భర్త కృతఘ్నుడు కారాదనీ భగవంతుణ్ణి ప్రార్థించాను! దేవుడు నా ప్రార్థన విని నీవు దున్నిన చాలులో ముత్యాలు పండించి వుంటాడు!' అంది. ఆ మాటలు వినేసరికి రాజుకి కళ్లవెంట నీళ్ళు జలజలా రాలేయి.

అంతా వింటూ, చూస్తూవున్న కర్కోటకయ్య పాషాణహృదయం కరిగి నీరైంది. భోరుమని యేడుస్తూ వాడు రాజుకాళ్లమీద పడి, "పాపాత్ముణ్ణి. క్షమించానంటేగాని లేవను!' అని, భీష్మించాడు. "ప్రభూ, ఈ ముత్యాలు మీరుదున్నిన చాలులో పండేయి. ఇవి మీరే పుచ్చుకోవాలి!" అన్నాడు. అందుకు రాజు "నావి కావు. మీవే. నీభార్య పండించుకుంది వీటిని! మీరే పట్టుకుపోండి" అన్నాడు.



# చందమామ పజిల్
## (భాషాభివృద్ధికి)

అడ్డము :

3. నీరు
5. సేన
7. పగలు
9. జెండా
11. సంతోషము
13. వదంతి




నిలువు :

1. నీడ
2. భూమి
3. శివుని అస్త్రము
4. ముసలితనము
5. ఒక ఓషధి
6. ఒక చెట్టు
8. బ్రహ్మచారి
9. దుఃఖము
10. ద్వీపము
12. పెరుగు
14. అరణ్యము

# వినోద చదరం

★

ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో ఆరు మాటలు నింపాలి. సరియైన మాటలతో నింపగలిగితే, అన్ని మాటలలోనూ చివరి అక్షరాలన్నీ ఒకేలాగ వస్తయ్. మీరు నింపగలరేమో ప్రయత్నించండి.

మీకు తెలియకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | | జ | | | |
| 2. | | న | | | |
| 3. | | మే | | | |
| 4. | | జ | | | |
| 5. | | యు | | | |
| 6. | | డు | | | |

అధారములు :

1. రాజులు చేసే యజ్ఞము
2. ఒక ఆశ్రమము
3. పసుపువన్నెగల రత్నం
4. పెద్ద పాము
5. ఒక వైద్య శాస్త్రము
6. మధ్యలో వచ్చినది




## గారడీలో జ్యోతిషం

ప్రేక్షకులు కాగితమ్ముక్క మీద రాసు కున్న మాటలను చూడకుండానే చెప్ప గలగటం చాలా చక్కని ఇంద్రజాలం అని చెప్పవచ్చు. అసలు దీన్ని జాగ్రత్తగా చెయ్యగలిగితే ఈ ఒక్క ఇంద్రజాలంతోనే మంచి పేరు సంపాయించవచ్చు.

ఇది ఎలాఅంటే: ఇంద్రజాలికుడు ప్రేక్షకులమధ్యకు కొన్ని తెల్ల కాగితాల ముక్కలు విరజల్లుతాడు. ఆ కాగితాలమీద ఒక పువ్వు పేరుకాని, ఒక దేశం పేరుకాని ఎవరియిష్టంవచ్చిన పేర్లు వాళ్ళురాసి, వాటినన్నిటినీ మడిచి తెచ్చి మళ్ళీ ఇంద్రజాలికుడికిస్తారు. ప్రేక్షకులు చూస్తుండగానే ఇంద్రజాలికుడు ఒక ప్లాస్టిక్ గ్లాసులాంటిది తీసుకొచ్చి, దాన్ని ఎడమ అరచేతిలో పెట్టుకుని, వాళ్ళు యిచ్చిన చీట్లన్నీ రెండవచేత్తో ఆగ్లాసులో పోసేస్తాడు. తర్వాత ఆ గ్లాసుపైన ఒక రుమాలు కప్పివేసి దాన్ని దారంతోకాని, రబ్బరుతోకాని బిగిస్తాడు. ఆ గ్లాసును అక్కడే అందరియెదుటా టేబిల్ మీదపెట్టి, ఇంద్రజాలికుడు ఒక్కసారి తెరవెనుకకు



వెళ్ళి, దుస్తులు మార్చుకుని మళ్ళీవచ్చి కుర్చీలో కూర్చుంటాడు. ఇహ వాళ్ళు రాసినపేర్లన్నీ ఒకరు 'హాలెండ్' రాశారని,

మరొకరు 'పోలెండు' రాశారని, వేరొకరు 'గులాబీ' అని రాస్తే ఇంకొకరు 'జిలేబీ' అని రాశారని వరసగా ఏకరుపెడతాడు. ప్రేక్షకులు తామురాసిన మాటలే అతడలా చూడకుండా చెప్పుకోగానే తెల్లబోతారు.

ఇంద్రజాలికుడు మళ్ళీ ఆగ్లాసును ఎడంచేతిలో పెట్టుకుని దానిపైన ఉన్న రుమాలు విప్పేసి అందులోవున్న కాగితప్ముక్కలను మళ్ళీ ప్రేక్షకులమీదికి చల్లేస్తాడు.

ఇందులోఉన్న అసలు కిటుకు యిది: ఇప్పుడీ కాగితమ్ముక్కలన్నీ పోసిన ప్లాస్టిక్ గ్లాసు అన్నానే, అది మామూలు గ్లాసుకాదు. ఆగ్లాసుకు అసలు అడుగు అనేది ఉండదు. అంచేత గ్లాసును ఎడమ అరచేతులో పెట్టుకుని పైన కాగితమ్ముక్కలువేస్తే అవి నిజానికి ఇంద్రజాలికుడి అరచేతులోనే పడతాయి. ఆ అరచేతులో కాగితమ్ముక్కలను అలాగే ఉంచుకుని ఆ గ్లాసుకు మాత్రం పైన రుమాలు కప్పి బిగించి దాన్ని అక్కడే టేబిల్‌మీద పెట్టేస్తాడు. ఇహ మిగిలినదంతా చాలా సులభమే.

ఇంద్రజాలికుడు తెరచాటుకి వెళ్ళినప్పుడు—ప్రేక్షకులు రాసిన చీట్లన్నీ నిజానికి తన చేతులోనే వున్నాయి కనుక—వాటిని చదివి కంఠస్థంచేసుకుంటూ దుస్తులువేసుకుని మళ్ళీ బైటికి వస్తాడన్న మాట. వచ్చేటప్పుడు మాత్రం మళ్ళీ ఆ కాగితమ్ముక్కలను తీసుకునేవస్తాడు. ఆ పేర్లన్నీ చెప్పటం అయిపోయాక ఆ కాగితముక్కలున్న చేతులోనే మళ్ళీ ఆ అడుగులేని గ్లాసును పెట్టుకుని, పైన రుమాలు విప్పేసి, రెండోచేత్తో గ్లాసులోంచి కాయితాలు తీసి ప్రేక్షకులకు యిచ్చేస్తాడు. గ్లాసు అడుగుభాగాన్ని కోసేసి, దానికి బదులు తిరిగే సెల్యులాయిడ్ ముక్కను అతికించి తయారుచేసుకుంటే ఈ ఇంద్రజాలాన్ని ఇంకా రమ్యంగా చేసిచూపవచ్చు. అలా తయారుచేసుకోవటం క్రొత్తగా ఇంద్రజాలం నేర్చుకుంటున్నవాళ్లకు కొంచెం కష్టం కనుక—కాస్త అనుభవమున్నవాళ్లే ఈ ఇంద్రజాలాన్నిచేస్తే బాగుంటుంది.

---

ఈ గారడిని గురించి పాఠకులు యింకా వివరంగా తెలుసుకోదలిచినట్టయితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ సరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. వారు రాసే ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వుండాలి. ఈ విషయం ముఖ్యంగా గమనించవలసి వుంటుంది.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్

12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,

కలకత్తా - 19

# అట్టమీది బొమ్మ

దివ్యమంగళమూర్తి ఐనటువంటి శ్రీకృష్ణపరమాత్మ ద్వారకలో ఉంటూ, ఒక నాడు "నేను జన్మించిన యాదవకులం ఉపసంహరించివేస్తేకాని, ఈ అవతార మెత్తిన ప్రయోజనం పూర్తికాదు" అని తనలో అనుకోసాగాడు.

కృష్ణుడు ఇలా ఆలోచిస్తూవుండగా విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దూర్వాసుడు, భృగువు, అంగరస్సు, కాశ్యపుడు, వామదేవుడు, అత్రి, వసిష్ఠుడు, నారదుడు మొదలైన మునులందరూ ఆయన దర్శనానికి వచ్చారు. వచ్చి, కృష్ణుని ఆజ్ఞప్రకారం పిండారకక్షేత్రం చేరుకొన్నారు.

అక్కడ యదుకుమారులు, నీతితప్పి ఇష్టారాజ్యంగా వర్తిస్తూవున్నారు. వాళ్ళ జులాయితనానికి మితీ మేరా లేకుండా వున్నది. క్షేత్రానికివచ్చిన మహర్షులందరనూ చూడగానే, ఒక వేడుకచేదామని వాళ్ళకు బుద్ధిపుట్టింది. వెంటనే, సాంబుడనే కుర్రవాడికి చూలాలువేషంవేసి, ఆ ఋషులయెదుట నిలబెట్టారు. నిలబెట్టి అతి వినయంగా పాదప్రణామం ఆచరించి "మహాత్ములారా!—మీరు త్రికాలజ్ఞులుకదా! ఈ స్త్రీకి ఏమిబిడ్డ కలుగుతుందో తెలుసుకోవాలెనని కుతూహలంగా ఉన్నదట. ఆమె అడగటానికి సిగ్గుపడుతున్నది, కాబట్టి మేమడుగుతున్నాము. దయవేసి చెప్పండి" అన్నారు.

మునులకు అరికాలిమంట నెత్తికెక్కింది. 'దానికేముంది అబ్బాయిలూ!—మంచిప్రశ్నే అడిగారు. ఈ అమ్మాయి కులనాశనంచేసే ఒక ముసలాన్ని ప్రసవిస్తుంది. ఇక వెళ్ళండి' అన్నారు. వారు సాంబుడి వేషం విప్పేసరికల్లా అందులో నిజంగానే ఒక ముసలం వున్నది! అయోమయమైపోయింది యదుకుమారులకు. భయంతో తల్లడిల్లిపోయారు వాళ్ళు. చేసేదిలేక, గురువాజ్ఞప్రకారం ఆ ముసలం అరగదీసి పొడిగా చేసి, దాన్ని సముద్రంలో కలిపారు. ఎంత అరగదీసినప్పటికీ ఆ ముసలం పూర్తిగా నాశనంకాక, అంకుశంమొనవంటి సన్నపాటిముక్క మిగిలేపోయింది. ఇదే శ్రీకృష్ణుని నిర్యాణానికి కారకమయింది.

పోతే,—వాళ్ళు చూర్ణంచేసి సముద్రంలో కలిపిన ముసలం వ్యాపించినంత మేరా, తీరాన ఒకవిధమైన రెల్లుగడ్డి మొలిచింది. సూదిమొనలకంటే వాడిగా ఉండే ఆ గడ్డితోనే చివరకు యాదవకుమారులు జగడమాడి, ఒకరినొకరు కొట్టుకోగా వారి కులం నాశనమై, ఋషుల శాపం ఫలించింది.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు :

ఆర్. కె. బాలాంబ - మదరాసు

# రంగుల బొమ్మ కథ—6-వ బొమ్మ

చౌన్ అనే యువకుడి తల్లికి జరుగురుగా కబురుపంపించి, శాన్‌మింగ్ తండ్రి ఆమెతో పెళ్ళిమాటలాడినట్టు కిందటిసారి చదివాము. ఆమెతో మాటాడుతున్నాడే కాని, అంతసేపూ అతని మనస్సులో ఏవేవో ఆలోచనలు కెరలుతూనేవున్నాయి. ఆ ఆలోచనలు ఎన్నెన్నో అనుమానాలతోకూడా కూడివున్నాయి.

ఐతే—చాన్ తల్లి ప్రసంగించటం పూర్తికాగానే శాన్‌మింగ్ తండ్రి మనస్సులోని ఆలోచనలూ అనుమానాలూ అన్నీ తీరిపోయినై. అతడు నిస్సంశయంగా వున్నాడు. పైగా, అతనిలో చెప్పలేని ఉత్సాహం రేకెత్తింది.

అసలింతకూ చాన్‌తల్లిచెప్పిన మాటల పర్యవసానం ఏమిటీ అంటే: చాన్ అనే కుర్రవాడు ఆమె కడుపున పుట్టినవాడు కాడు. మరి, వాడిమీద ఆమెకెందుకింత అపేక్ష?—ఇందుకొక చిత్రకథ వున్నది: ఒకానొక ఆసామీ కొడుకును కన్నాడు. కన్న బిడ్డడి ముద్దూ మురిపెమూ చూచుకోకుండానే అతడు ఈ లోకం విడిచిపోయాడు.

అక్కడవుండే దాది, పుట్టినబిడ్డను ఉన్నవాడిని ఉన్నట్టుగానే ఎత్తుకపోయి మాయమైంది. ఇలా ఎత్తుకపోవటానికి కారణం లేకపోలేదు. కుర్రవాడికి ఒక మేనమామ ఉన్నాడు. వాడు పరమ దుర్మార్గుడు. మహచెడ్డ ఆశాపాతకుడు. ఈ పసివాణ్ణి ఏదోవిధంగా మాయచేసి చంపించివేదామనీ, వాడికి చెందవలసిన ఆస్తికాస్తా తను కాజేదామనీ పన్నాగంపన్నుకుని తయారుగా కూర్చున్నాడు. ఈ గండం తప్పించేటందుకే దాది బిడ్డడిని ఎత్తుకపోయింది. కాగాపోగా, చాన్‌తల్లి కష్టసుఖాలు ఎరిగినదీ, కనికరం కలదీ అని తెలిసి దాది ఆ బిడ్డను ఈమె చేతులలోపెట్టి వెళ్లిపోయింది. ఈమె, తనకు వప్పగించిన ఆ బిడ్డడిని పరప్రసాదంగా ఎంచి, భక్తిశ్రద్ధలతో పెంచి పెద్దవాడిని చేసింది. కన్నప్రేమకంటె పెంచిన ప్రేమ ఎక్కువదని పెద్దలంటారు. ఈమాటను ఆమె సార్థకంచేసింది.

ఆ బిడ్డడే ఇంతటివాడైన చాన్. పోతే—చాన్ తండ్రి ఎవరనుకొన్నారు? శాన్‌మింగ్ తండ్రికి వేలువిడిచిన సోదరుడే! ఇంకేం?—సంబంధాలు తెలిసిపోయాక సందేహాలకే తావులేకపోయింది. అన్నీ బాగానే కలిసివచ్చినై.

దైవమాయకు అందరూ ఆశ్చర్యపడ్డారు. దేశాచారంప్రకారం, చాన్‌కూ శాన్‌మింగ్‌కూ అతివైభవంగా పెళ్లిజరిగింది. వాళ్లు సుఖంగావున్నారు. ఐతే,—శాన్‌మింగ్ తన కింతటి ఉపకారంచేసిన మహిమగల ఆ గొడుగుపిడినిమాత్రం అహర్నిశలూ స్మరిస్తూనే వుండేది. [ఈ రంగులబొమ్మ కథ ఇంతటితో సరి]

49-వ పేజీలోని

పజిలుకి జవాబు :




49-వ పేజీలోని

వినోద చదరానికి జవాబు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రా | జ | సూ | య | ము |
| 2. | వా | న | ప్ర | స్థ | ము |
| 3. | గో | మే | ధి | క | ము |
| 4. | అ | జ | గ | ర | ము |
| 5. | అ | యు | ర్వే | ద | ము |
| 6. | న | డు | మం | త్ర | ము |

## పైచూపు - కిందిచూపు

బంగారపు గనులలో పనిచేసే ఒకతడు ఒకప్పుడు పల్లెటూరు రైతుని పలకరిస్తూ 'ఏమయ్యా ఎప్పుడుచూచినా మట్టిలోనే పొరలాడుతూవుంటావే, నీ జీవిత మిక యింతేనా? పైస్థాయికి వెళ్లడమంటూ వున్నదా?' అని వేళాకోళంచేశాడు.

అందుకు రైతువాడు 'బాబయ్యా! ఏదో కాయగూరలూ, పప్పుదినుసులూ పండించి, భుక్తిగడుపుకొంటాను. ఇదే మాకుబంగారం!' అన్నాడు.

గనిపనివాడు "అః!—ఎంత శ్రమ పడితేమాత్రం ఒరిగేదేమిటి! చాలదనే దేవులాడుతావే!" అని గేలిచేశాడు.

ఈమాటలు రైతువాణ్ణి రెచ్చగొట్టినై. 'వెళ్లవయ్యా పెద్దమనిషీ!—నువ్వు పండించే బంగారం లేకపోయినా ప్రజ బతకగలదు. నేను పండించే కాయగూరలూ పప్పులూ లేకుంటే క్షణం గడవదు. నువు వేలాది పనివాళ్లలో తల అమ్ముకొన్న ఒకడివి. నేనా!—సర్వస్వతంత్రుణ్ణి. పోతే,—వ్యవసాయానికి దైవసాయంకావాలి. అందుకని నేనెప్పుడూ పైకేచూస్తూంటాను. బంగారం కోసం నీచూపు ఎప్పుడూ కిందికే. ఎలా ఐనా, నీకంటే నేనేమేలు. నాజీవితమే సార్థకమైంది" అని బదులుచెప్పాడు రైతు. మరి మాటాడలేకపోయాడు గొప్పలుచెప్పే గనిపనివాడు.






Printed by B. NAGIREDDI at the B. N. K. Press Ltd., Madras 24, and Published by him from Chandamama Publications, Madras 24, Controlling Editor : SRI CHAKRAPANI

